ప్రథమ ముద్రణం
మే 1953-1000
ద్వితీయ ముద్రణం
నవంబరు 1958 - 1000



## హెచ్చరిక

కేవలం వినోదం నిమిత్తమైనా సరే, లేక సొమ్ము వసూలు చేసుకొనే నిమిత్తమైనా సరే, ఈ ప్రదర్శనాలలో ఎదైనా సభ ఎదట ఆడదలచిన ప్రతి సంఘంవారున్నూ ముందుగానే, నాకు వ్రాసి లిఖితానుమతి పొందక పోవడం కాపీ రైట్ చట్టప్రకారం ఒక నేరం గనక, ఆసంగతి గమనించి లిఖితానుమతి పొంది తరవాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి రాధాకృష్ణ.
రాజమండ్రి

శ్రీ కొండపల్లి ముద్రాశాల
రాజమండ్రి

వెల
రూపాయి

# రః పూ ప్రో దూ !

రంగాలు పేర్లు

(1) పెళ్ళికూతురు ముసలి వేషంలో పలాయనం
(2) ముసిలావిడ పెళ్ళికూతురవడం
(3) ముసలివరుడే పెళ్ళికూతురికి రాయబారి కావడం
(4) తండ్రికి రెండు తంత్రాలు
(5) మరంతోటలో మరోజంట
(6) రెండున్నర వివాహాలు

పాత్రలు

పరిధానం—(జలేశం కొడుకు; విశాలకి ప్రియుడు)
జలేశం—(పరిధానానికి కిశోరికీ తండ్రి)
నభోమణి—(కిశోరికి ప్రియుడు)
మండోదరం—(కిశోరికి తండ్రి ఎంచిన ముసలి)
కరాళం—(మండోదరానికి స్నేహితుడు)
తంపటి—(పరిధానం నౌకరు)
కిశోరి—(కథానాయకి)
విశాల—(కిశోరికి స్నేహితురాలు; మరో వధువు)
అమ్మతల్లి—(జలేశం ఇంటిపెత్తనం చేసిపెట్టే సకేశ)

సంకేతములు : (నటించేవారికి)

R F - కు. ఎ. - కుడిఎదర
R M - కు. మ. - కుడిమధ్య
R B - కు. వె. - కుడివెనక
L F - ఎ. ఎ. - ఎడమఎదర
L M - ఎ. మ - ఎడమమధ్య
L B - ఎ. వె. - ఎడమవెనక
M F - మ. ఎ. - మధ్యఎదర
M M - మ. మ. - మధ్యమధ్య
M B - మ. వె. - మధ్యవెనక

## రంగ ప్రవేశ క్రమం !

| పాత్ర : | వచ్చే రంగాలు |
|---|---|
| ప— | 1, 2, 4, 5, 6 |
| జ— | 1, 2, 4, 6 |
| న— | 1, 3, 5, 6 |
| ముం— | 1, 2, 3, 4, 6 |
| క— | 1, 2, 3 |
| తం— | 1, 4, 6 |
| కి— | 1, 3, 5, 6 |
| వి— | 1, 5, 6 |
| అ— | 1, 2, 6 |

| రంగం : | | వచ్చే పాత్రలు |
|---|---|---|
| 1. | — | తం, న, కి, జ, ప, అ, వి, ముం, క |
| 2. | — | జ, ముం, అ, క, ప |
| 3. | — | కి, క, న, ముం |
| 4. | — | జ, తం, ప, ముం |
| 5. | — | కి, వి, న, ప |
| 6. | — | న, ముం, కి, ప, వి, జ, అ |

---

# ఈడూ జోడూ!



## రంగం-1

[వీధి. ఒక గుడ్డిలాంతరు పుచ్చుగుని, తంపటి
R F నించి నిద్దరమత్తుగా నడుచుగుంటూ వస్తాడు.]

—చాలారాత్రి గడిచింది. (పైకి ఇటూ అటూ చూసి) ఇక ఆట్టే ఉండదు. అబ్బ! నౌకరీ లన్నింటిలోకీ, మోహంలో చిక్కడ్డ యువకుడిదగ్గిర నౌకరీ చెయ్యడం మరీ చచ్చేచావు! ప్రేమ వ్యాపారమే ఎరగని ఘటాన్ని కాను నేను. కాని, నా ప్రేమరకం వాస్తవికం, నా యజమాని పరిధానంగారి ప్రేమరకం మానసికం. సరి సరి. (అని ఉలిక్కిపడి బాగా మెలుకువ తెచ్చుగుని) వెంటనే వెళ్ళాలి. నా యజమాని, నాకోసం చూస్తూంటాడు. వారి ప్రేయసి విశాల. ఈ క్షణంలో నా యజమాని, విశాలగారి యింటోంచి క్షేమంగా బయటపడడానికి పన్నాగం పన్నుతూంటారు. (వినడం అభినయించి) ఎదో గానం వినిపిస్తోంది. ఓహో, అల్లాచెప్పూ! నా యజమానిగారి స్నేహితుడు నభోమణిగారై ఉంటుంది. వారికి కిశోరిమీద ప్రేమ. కిశోరి నా యజమానిగారి చెల్లెలు. కిశోరిగారికి మేలుకొలుపులు పాడేటందుకు నభోమణిగారు వచ్చిఉంటారు. బహుశా, అంతే! అయితె ముసిలి బాబుగారు లేచేస్తాడు. లేచి

"అబ్బాయీ" అంటూ కొడుకుకోసం కేకలేస్తాడు. ఆలస్యం చెయ్యకుండా నా పనిమీద నే నుండాలి. ఈ పక్కనించి పోతాను. (అని R F నించే వెనక్కి పోతాడు.)

[R F నించి నభోమణి చేతిలో మురళి పట్టుగుని వస్తాడు.]

న—అయ్యో! నా హృదయం యొక్క కోమలత్వం ఈ యంత్రం పాడగలదా? నా నిట్టూర్పుయొక్క వినయం దీనికి అలవడుతుందా? ఊరుకోలేక యత్నించాను! గానంయొక్క మహిమ మెలుకువలో ఉన్నవాళ్ళని జోలకొట్టేస్తుంది. నిద్దట్లోవాళ్ళని లేపేస్తుంది. నా ప్రేయసి కిశోరి, నిద్రలో ఉంటుంది నా గానం ఆమెని జోకొట్టి నిద్రలోనే ఉంచినా నాకు బాధే. లేక అది ఆవిడ నిద్ర చెడగొట్టినా నాకు బాధే. వచ్చి గానం చేస్తూన్నది నేనని ఆమెకి తెలియాలిగాని, కోమలమైన ఆమె నిద్రకి మాత్రం భంగం కాకూడదని నా ఆశయం.

[L B నించి కిశోరి వస్తుంది.]

న—కిశోరీ!

కి—మణీ!

న—నీకు నిద్రాభంగం చేశానా?

కి—లేదు. నేను నిద్రలో లేను.

న—నువ్వు మెలుకువలోనే ఉంటే, నిన్ను నిద్రపుచ్చేటంత సౌఖ్యం నా గానంలో లేదా?

కి—ఈ గానంలో నువ్వే స్ఫురించడంవల్ల దానిలో ఉండే సౌఖ్యం గమనించడానికి నాకు తీరుబడి లేకపోయింది.

న—నువ్వు నిద్ర మెలుకువలు రెంటింటిలోనూ ఉన్నావా?

కి—రెండింటిలోనూ లేను.

న—నువ్వు అవతరించావా?

కి—ఉద్ధరించేవాళ్ళు అల్లాఅనుకుంటారు.

న—నువ్వు ఉదయించావా?

కి—లేదు. నా జీవితం ఉదయించింది.

[L F నించి జలేశం నిద్దరమత్తుగా వస్తాడు]

జ—ఏమిటీసంతా! ఫిడేళ్ళ కీచు. పిల్లంగోర్ల గిలగిల, ఊదడాలు, బాదడాలు, గోకడాలు, గీకడాలు, అరుపులు, చరుపులు, ఈలలు, కూతలు ఛీ! పొండి, అవతలకి పొండి పాడుసజ్జు! పాటలుట!

కి—నాన్నా, అదేమిటి మీరు! అంత మోటుగా!

న—నేను ప్రేమలో విధేయుణ్ణండి.

జ—అమ్మాయి! చాల్చాలు. ఇట్లాంటివా నువ్వు చెవిని బెట్టవలసింది? ఈపాటిదయచెయ్, ఇంట్లోకి!

కి—మణీ! శెలవు.

న—నువ్వు వెళ్ళిపోవాలా, కిశోరీ?

కి,న—మనం మళ్ళీ, త్వరలో, కలుద్దాం. మనకి శత్రువు లున్నా, ప్రేమ దేవుడు, మనపక్షం దెబ్బలాడతాడు.

జ—ఏదీ తుపాకీ!

కి,న—ప్రేమబాధ, ప్రేమదేవుడికి తెలుస్తుంది.

జ—దీని రవ్వలు (తుపాకీ ఝళిపిస్తూ) మీ బుర్రల్లో ప్రవేశిస్తే, మీకూ తెలుస్తుంది. [నభోమణి RF కీ, కిశోరి LB కీ పరుగు పరుగున వెళ్ళిపోగా, జలేశం కినిగా LF కి పోతాడు.]

[రెండో తెర పడుతుంది. RF నుంచి ఆలోచిస్తూ పరిధానం వస్తాడు.]

తం—(వెనకాలే వస్తూ) అయ్యగారండీ!

ప—(వెనక్కి తిరిగి వాణ్ణిచూసి మళ్ళీ ఆలోచనలో పడతాడు.)

తం—నన్నడిగితేనండి, నిజంగా; వారానికో ఎంతకో కాస్తంత నిద్దరఉంటే,......

ప—ఊరుకో, శుంఠా! నిద్దరసంగతి నాదగ్గిర ఎత్తకు.

తం—అబ్బెబ్బే అదికాదుస్వామీ! నే చెప్పేది మిక్కిలి నీచంగా, మోటుగా, గాఢంగా ఉంటుండే గుర్రు నిద్దర కాదండి. లలితమైన ఒక కనుమూత, ఒక అరగంట పాటు కునుకుదాల్లోఉండే మజా గ్రహించడానికేనా—ఉండి తీరాలనే విషయం నా ఆలోచనలోంచి కొట్టిపారెయ్య లేకుండా ఉన్నాను.

ప—ఈపాటి నోరుమూసుకో, కోతీ!...అయ్యో! విశాలా! నువ్వెంత క్రూరురాలవే! నాకునిద్రశాంతి లేకుండా చేస్తివిగదా!

తం—నాకూ అల్లానే జరిగింది.

ప—ఓరి. నీదేవుడు ఇదైపోనూ! ఇల్లాంటి వరకంలో ట్రా వేళాకోళం!—అయ్యో! పోనీ మర్యాదలు జరిగాయా అంటే, నన్ను ఆవ్యక్తి ప్రేమించిందా? ఏమో! నేను నమ్మను.

తం—నేనూ అంతే.

ప—లేక, ఒక్కొక్క సమయంలో తమ కోరిక లేమిటో తమకే తెలియకపోడం స్త్రీజాతి లక్షణం కాదు గదా!

తం—తెలియకపోడమే? మాంఛాగా తెలుస్తాయి. పైకి అనరు!

ప—అయ్యో! ఈ భూప్రపంచంలో, విశాలవంటి అసందర్భపు ఘటం మరొకరు ఉంటారా?

తం—(తనలో) ఆ. మరొకరు ఉన్నారు.

ప—ఔరా! ఉన్నారు. ఆమె చాంచల్యానికి దాసోహం చేసే సాధుజంతువు.

తం—(తనలో) ఈయన అల్లా అనక మానరని నాకు తెలుసు.

ప—విశాల! క్షణానికో ధోరణి, విసిగిస్తుంది. తన మాటే పైనుండాలి, తను పట్టిన కుందేటికి మూడేకాళ్ళు, పెడసరంగా అసంగతంగా వ్యవహరిస్తుంది. ఆమె తెలివి తక్కువలూ నేరాలూ పోగుచేస్తే గందరగోళం తయారవు

తుంది. ఆమె చూపులే తిరస్కారణం! ఇక ఆమె నవ్వులు-ఓరి పాడు దేవుడా—ఆ నవ్వులు నాకు జ్ఞాపకం రాకపోయినా తీరిపోను! ఆ నవ్వుల్లో. ప్రజ్వలించే మనోహరత్వం, మనోహరమైన ప్రజ్వలనం ఉన్నాయి-అయ్యోయ్యో! ఆ నవ్వులు నేనెట్లా వదులుకోగలను? ఆ నవ్వులు నాకు దక్కనినాడు, నేనే ఉండను. ఉన్నా నాకు మతి ఉండదు.

తం—అయ్యో! ఆ దిక్కుమాలిన నవ్వులే సర్వనాశనం చేశాయి.

ప—ఆహా! ఆమె మహిమలు మరచిపోయి, ఆమె తప్పులు మాత్రమే తల్చుగున్నానా, నిష్పాక్షికమైన బుద్ధి వ్యవహరించి, నిరంకుశప్రేమని నిరాయుధం చేస్తుంది! కాని, మళ్ళీ ఆవిడ మనోదార్ఢ్యాలన్నీ ఏకరువు పెడుతూ కూచున్నానా, ప్రేమ తలెత్తి ఆవిడ సౌందర్యాల్లో ప్రతి సౌందర్యానీ గమనిస్తూంటుంది, బుద్ధి గడ్డితినేస్తుంది.

తం—(R F కి చూసి) అయ్యో! నభోమణిగారు ఇల్లా వస్తున్నారు.

ప— సరే, నువ్వింటికి నడు. ఇప్పుడే వస్తాను

తం—ఔర! ఆ దిక్కుమాలి నవ్వులవల్లె ఇదంతా! (అని L F కి పోతాడు)

(R F నించి నభోమణి వస్తాడు)

ప—మణీ! మా యింటిఎదట ఇంతకి ముందే నువ్వు గానం చేశావని మా తంపటి నాతో చెప్పాడు. మా నాన్న తేచాడా?

న—ఆ, ఆ గానం ఆయనకి విపరీతమైన వికారం ఏదో కలిగిస్తుందిగావును, ఆయన కేకలూ బొబ్బలూ ఆరంభించాడు. లేచి చక్కావచ్చాను. సరేగాని, నువ్వు లేచావే, ఇంత పెందరాళే!

ప—నీతో లోగడ చెప్పానేమో! నాప్రేయసి విశాలని మరప్రవేశం చేయించడానికి రేపటికి ముహూర్తం పెట్టించింది, ఆవిడ సవితితల్లిగారు,—విశాలఆ స్త్రీకెంకర్యం చేసే సంకల్పంతో! ఈ సంగతి వినగానే, నాకు మతిపోయి, నేవెళ్ళి విశాల దాసీని లోబరుచుకుని రాత్రి రెండు గంటలవేళ విశాల గదిలో ప్రవేశించాను. విశాల మెలుకువగానే ఉందిగాని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

న—నువ్వు చాలా అదృష్టవంతుడవు పరిధానం!

ప—అబ్బ నీ తొందర బంగారంగాను, చివరంటా వినవయ్యా!—ఆమట్టున విశాల ఎదురుతిరిగి చెలరేగి, ఔరారా! ఇల్లాంటి అపరాత్రివేళ నాగదిలో దూరావా? మహా నమ్రతగ్గ రౌడీలానే ఉన్నావు ఎక్కడోగాని! అంటూ నన్ను తలవాచేందుకు తిట్టింది.

న—అవు నవును. మొదట్లో గావును అదంతా!

ప—అబ్బే! మొదట్లో కాదు. నామాట ఒక్కటీ ఆమె వినిపించుగోకపోతేనా! నేను గనక తక్షణం వెళ్ళిపోకపోతే, తన సవితితల్లినికూడా లేవగొడతానంది.

న—సరే, సరే, చివరికి?

ప—చివరికా ? వెళ్ళినవాణ్ణి వెళ్ళినట్టుగా ఖరాగా ఇవతలకి వచ్చెయ్యవలిసొచ్చింది.

న—ఆమెకి కోపం తెప్పించే పన్లు ఏమీ నువ్వు చెయ్యలేదు ?

ప—లేదు లేదు, దైవకృపవల్ల ! ఎటొచ్చీ ముద్దు పెట్టుగున్నాను—ఒకటి రెండు డజన్ల ముద్దులు.

న—అంతేకదా ! ఇంకా ఏముటో బ్రహ్మాండం చేస్తావేమిటీ ? అంతకంటె దాఖలా మరేం కావాలీ ?

ప—అబ్బ అదికాదోయ్ ! నేను పిసరంతేనా అతిక్ర మించలేదు మర్యాద.

న—ఓయి దేవుడా. నీమాట కాదయ్యా, నేననేదీ—ఆవిడమాట. ఒక్క సంగతి చెప్పు పరిధానం ! ఆ తలుపు తాళంచెవి వాళ్ళదగ్గిర ఉందా లేదా ?

ప—ఉంది. నేను ఇవతలికి రావడంతోటే దాసీ మనిషి ఆ తాళంచెవి దాచేసింది.

న—అంటే అర్థం, ఆ దాసీపిల్ల యజమానురాలు నీతో లేచివస్తుం దన్నమాట—కావలిస్తే చెవికదపా యిస్తాను.

ప—ఆమె లేచివచ్చినా, నా పోటీదారు పుణ్యాం పండించేమో ! నా ప్రస్తుతస్థితిలో నేను ప్రతీవాణ్ణీ అను మానిస్తూనే ఉన్నాను—నీమాట చెపుదూ ఎవరో ఎందుకూ ! లోగడ నువ్వామెని దేవదూత అనేవాడవే, నే నిప్పు డంటూన్నట్టు !

న—అవును, నిజమే. అనేవాణ్ణి – నన్నావిడ గణించడం లేదని నేను గ్రహించుగునేవరకూ! తరవాత నేను నిదానించి చూస్తే, ఆవిడలో నాకు సల్లక్షణమేకనపడలేదు. కంటితళుకు–అంటావు. నాకేసే చూడని కంట్లో తళుకు నే నెల్లా చూడగలను! అధరామృతం – అటావు. నేను అనడం అసంభవమైన అధరంమీద నాకు అమృతం ఎట్లా గోచరిస్తుంది? నన్ను కోరని కన్య చెక్కిళ్ళు సహజ సుందరాలైతేం, అద్దాలైతేం? నామీద అనురాగం వాటిల్లో ప్రతిఫలిస్తేతప్ప నాకెట్లా తెలుస్తుంది! ఆమె పాణి కోమలం కావచ్చు, నేను గ్రహించి చూడందే! పైగా కృతజ్ఞతతో అది నాచెయ్యి గ్రహించనద్దూ? ఆమె హృదయం పొంగిపోతుంది దీక్షగా చూడమంటావు. పోనీ అల్లానే చూస్తును, ఆవిడ నిట్టూర్పు లన్నీ నన్నుగురించే అయితే! అదంతా అల్లా ఉంచు, పరిధానం! నాప్రేమకి ఏకైకలక్ష్యం నీ సోదరి. ఆ విషయంలో నాకు సాయంచేస్తివా, విశాల గురించి నీకు నేను అడ్డురాను.

ప—నా చాయశక్తులా, కుటుంబగౌరవానికి లోటు రానంతవరకు, నీకు నేను సాయం చేస్తానని నీకే తెలుసు, కాని లేవదీసుకుపోవడం తగదు.

న—కాని, నువ్వు, విశాలని లేవదీసుకు పోవచ్చా?

ప—ఓ, ఆదారివేరు! మనం ఇతర ఆడవాళ్ళతో వ్యవహరించగల రీతిగా ఇతరులు మన ఆడవాళ్ళతో వ్యవహ

రించ వచ్చని మనం అనుకుంటామా? అసలు, అదీగాక, విశాలని రేపంటే రేపే మరల ప్రవేశం చేయిస్తారు మరి.

న—అయితే, నన్ను గురించిన పరిస్థితులుకూడా అంత పాడుగానూ ఉన్నాయిగా మరి! నీ సోదరిని రేపంటే రేపే షాహుకారు మండోదరాన్ని పెళ్ళాడి తీరాలని బలవంతం చేస్తున్నాడుగా మీనాన్న!—సరి, ఒక్కసారి, రా. ఆలోచన చేసి పన్నుదాం.

ప—నేను యింటికి పోవాలి.

న—మరి, సెలవు.

ప—మణీ! మరోమాట. ఒకవేళ నువ్వు మా కిశోరిని ప్రేమించి ఉండకపోయినా, విశాల దగ్గర్నించి నాకు ఉద్వాసన చెప్పించ దల్చుకుంటావేమో అనుకుందాం అంటే, నీదగ్గర ఎంత నిజాయితీ ఉంది! ఎల్లాంటి స్నేహం నీదీ!

న—అదా! స్నేహం బుద్ధికి కట్టుబడి ఉంటుంది. కాని, ప్రేమారాధనచేసే హృదయంలో సౌందర్యంతో పేచీవచ్చినప్పుడు, ఏదీ ద్రోహంకాదు, ఏద్రోహమైనా దైవంవల్ల రద్దైపోతుంది. స్నేహితుడితో చేసిన ప్రమాణం చట్టప్రకారం ఉండే శపథంమాత్రమే అని నా అభిప్రాయం. కాని, నేనుఆరాధించే మహిమలకి అనుకూలంగావర్తించడం మతమే అనుకుంటాను.

(R F కి వెళ్ళిపోతాడు.)

ప—ఈవిషయంలో ఎప్పుడు మణిని ప్రశ్నించినా ఇతని సమాధానం రీతి ఏదో చప్పరించినట్లు ఉంటుంది. కాని. నాకు కొంత భయం కలిగిస్తూ ఉంటుంది –ఇంతాచేసి చివరికి, విశాల ఇతణ్ణే ప్రేమిస్తే! అనుమానానికి తగ్గ కారణాలూ కనిపిస్తాయి, మళ్ళీ ఆమె నన్నే ప్రేమిస్తోందనడానికి బలీయం అయిన నిదర్శనాలూ ఉన్నాయి. నా భయాలన్నీ నిజం అవుతాయా. నాఅంత దరిద్రుడు ఉండడు. లేక అవేవీ నిజం కానట్లు తేలుతుందా, అటువంటి ఆనందానికి నేను తగను. అనుమానం అనేది, హృదయ విదారకంగా ఉండే అనేక క్షోభలకి మూలం. అనుమానంపడ్డ ఘటానికిగాని అను మానం అంటే బోధబడదు. నా ప్రేయసి తన నవ్వులు నామీద విసిరే టప్పటి ఆనందంలో నేను ఆమెని ఎంత ఆరాధిస్తానో నేనే ఎరగను. కాని, ఆ నవ్వుల్లో చిన్న భాగం మరొకరికి ఎవరికేనా దఖలు పడిందా, నేను ఆ నవ్వుల్ని లోకడ ఎల్లా మెచ్చుకోగలిగానా అని ఆశ్చర్యం వేస్తుంది. ఇల్లాంటి నా పరితాపానికి దరీ అంచూ ఎప్పటికో! ఆమె మరీ దగాఅని తెలుసుగున్న మీదటకుడా నేను మరీ వెర్రిని పడిపోవడం ఎందుకో! (LF కి పోతాడు. రెండో తెర లేస్తుంది. జలేశం ఇంటిభాగం)

కిశోరి—(LM నించి ప్రవేశించి, దిక్కులు వెతికి, LB కి వెళ్ళి మళ్ళీ వస్తుంది)

అమ్మతల్లి—(వెనకాలే వస్తుంది)

కి—(చప్పుడు చెయ్యొద్దు అన్నట్టు అభినయిస్తుంది)

అ—(జాగ్రత్త అభినయిస్తుంది)

కి—(మెల్లిగా) మనం నెగ్గుతామా ? అమ్మతల్లీ ?

అ—సూక్షిగా.

కి—ఏమిటి మళ్ళీ చెప్పూ - మన పథకం.

అ—ఉత్తరం నా చేతుల్లో ఉండగా. మీనాన్న చేత నేను పట్టుబడతాను. నన్ను ఇంట్లోంచి గెంటేస్తాడు. నా సామానుగట్రా తీసుకుని నేనే పోతానని ఇంట్లో ప్రవేశిస్తాను. నువ్వక్కడ సిద్ధంగాఉండి నా వేషంధరించి వెళ్ళిపో! నేను గదిలో పెళ్ళికూతురులాగ కూచుంటాను.

కి—ఈ సన్నాగం తిరిగిపోదంటావా ?

అ—ఎంతమాత్రం తిరిగిపోదు. కాని తక్షణం ఆచరించాలి. ఆగదిలో సర్వమూసిద్ధం చేశాను మరిదైవాధీనం.

కి—తను చెప్పినవాణ్ణి నేను ముడెట్టుగోకపోతే మా నాన్న చేసిన శపథం విన్నావా ? తను నా మొహం చూడట్ట.

అ—అబ్బ, అవును కిశోర్, ఆయన తన స్నేహితుడితో చెప్పినమాటలు నేను విన్నాను. అక్షరాలా చెప్తాను విను. "రేపు మా అమ్మాయిని నిక్కచ్చిచేస్తాను. ఇసకపుట్ల - మండోదరాన్ని పెళ్ళాడతావా, ఆడవా అని ఆఖరుసారి అడిగేస్తాను. మాపిల్ల వెంటనే సరే అనక నసగడం మొదలెట్టిందా, దానికి జ్ఞానోదయం అయ్యేవరకూ దాని మొహం చూడనని ప్రమాణం చేసేస్తాను." అన్నారు.

కి—మానాన్న ఏదేనామాట అన్నారంటే, ఆమాటే పట్టుకుని మహా మొండిగా వెళ్ళిపోతారు. ఆ స్వభావాన్నే ఆధారంచేసుకుని వేశావన్నమాట ఈ ఎత్తు. నా దాసీ దానికి ఈ రహస్యం తెలుసా ?

అ—ఆ. కాని, కిశోరి ! మనం నెగ్గితే నువ్వు ఆ చిన్న మండోదరంమీద హక్కు వదులుకుని, అతణ్ణి నాకు అప్పగించి ఊరుకోవాలి.

కి—అందు కభ్యంతరంకూడానా ! హృదయపూర్వకంగా ఆతణ్ణి నీకు సమర్పించేస్తాను. అతణ్ణి నువ్వు స్వాధీనం చేసుకో. నీకు సుఖం కలగాలని ప్రార్థిస్తాను. నే వరించేమణి ఎంత పేదవాడో, మండోదరం అంత ధనికుడు.

అ—(LM కేసి చూసి) ఆవేపునుంచి నాన్నగారు వస్తున్నట్టున్నారు. మణి నీకు రాసిన ఉత్తరం ఇల్లాతే. త్వరగా. దానిమూలాన్నేగా నన్ను ఇంటోంచి పంపించెయ్యవలిసిన అవసరం తీసుకురావలిసింది ! అది నీ కింకా అందనట్టుగా కనిపించడానికి, జాగర్తగా ముద్ర మళ్ళీ వేసెయ్యాలి.

కి—(ఉత్తరం ఇస్తుంది)

అ—(L B కి వెళ్ళిపోతుంది)

(L M నించి ముందు జగేశం, వెనకాలే పరిధానం వస్తారు. కిశోరి R M కేసి జరిగి నుంచుంటుంది)

జ—ఒరే ! పరిధానం ! ఏమిటి సంగతి ? ఆ పాడు పిల్లినరాలు గిక్కుంటూ, ఆగాడిద బూరాలు ఊదుకుంటూ,

ప్రేమగీతాలు పాడుకుంటూ, చుట్టుపక్కవాళ్ళకి విశ్రాంతి లేకుండాచేస్తూ, నువ్వుకూడా ఊరేగుతున్నావా ఏమిటీ? ఛీ! ఫో! చెల్లాయికి మాంగాప్పగా చూపిస్తున్నావు, మూర్ఖం! కాని, ఏమయ్యోయ్, అమ్మాయి! నేచెప్ప వచ్చిం దేమిటంటే, అర్ధరాత్రివేళ, ఈ అంకమ్మ శివాలూ ఈ మోహపు సంకీర్తనాలూ, ఇవన్నీ మరి నేను సహించను. ఇవి చెవిద్వారా ప్రవేశించి తద్వారా బుద్ధిని లేవదీసుకు పోతాయి, అల్లరికి అంతం అంటూ ఉండాలి—మంచో చెడో ఇహానో ఇప్పుడో వస్తాడు. రేపు నువ్వతణ్ణి పెళ్ళి ఆడాలి.

కే—నేను బతికి ఉండగా అతణ్ణి పెళ్ళాడనండి.

ప—అవునుగానండి, నాన్నగారూ! అల్లాంటి ఘటం మీకు అల్లుడు కావాలని ఎల్లా కోరుకుంటున్నారండీ. ఆశ్చర్యంగా ఉంది.

జ—చిత్తం, చిత్తం అబ్బాయిగారు. కోరం దేకుండా, మీ విలవగల చాదస్తం నామీద రుద్దుతున్నారు. సరే దయచేసి చెప్పండి. ఆయనమీద ఏమిటి తమ ఆక్షేపణ?

ప—మొదటి సంగతి అతనిమాట యాస.

జ—అతనికి యాస ఎంతమాత్రం లేదండి, అబ్బాయి గారూ! ఇప్పుడు అతనంత స్వచ్ఛంగా మాట్లాడలేనివాళ్ళు చాలామంది ఉన్నారు.

ప—అతడు మతం మార్చేశాడు.

జ—అదో పొరపాటు నీలో. కొత్తమతం మళ్ళీ మార్చేసి పాతమతంలోకి అతడు వచ్చి ఆరువారాలు దాటింది.

ప—ఆస్తి కలుస్తుందని పాతమతం వదులుకున్నాడు. ఏదేనా కొత్తమతం సంపాదించడానికి వ్యవధి సరిపోయి ఉండదు.

కి—అందుచేత దేవాలయానికీ అమ్మవారుగుడికీ మధ్యనుండే పాడుగోడలాగ, పాతనిబంధనకీ కొత్తనిబంధనకీ మధ్యనుండే తెల్లకాగితాలులాగ ఆయన ఉండిపోయాడు.

జ—ఇంకా ఏమన్నా ఉంటే కానీండి.

ప—అతడి శీలంలో ఎన్నతగ్గ లక్షణం ఏమిటంటే, ఇతరులకి టోపీ వెయ్యడంలోనూ, ఇతరులమీద నక్కజిత్తులు ప్రయోగించడంలోనూ, అతనికి ఉండే ప్రబలతృష్ణ.

కి—కాని, ఆయనదగ్గర దగాకోరుతనంకంటె మూర్ఖత్వమే ఎక్కువపాళ్ళు ఉందనిన్నీ, ఇతరుల నిమిత్తం ఆయన అల్లుతూండే టోపీ సాధారణంగా ఆయన నెత్తిమీదికే వస్తూ ఉంటుందనిన్నీ విన్నాను.

ప—నిజమే, కిశోరీ! ఒక్కొక్కడు తుపాకీ పేలుస్తాడు—లక్ష్యాన్ని కొట్టలేకపోడం అల్లాఉండగా, తన తుపాకీయే వెనక్కి అదరడంవల్ల ఆ అదురుకి తను దెబ్బ తింటాడు.

కి—ఇంతెందుకూ! భర్త అనేటందుకు ఉండరాని మిక్కిలి అవలక్షణం ఆయన్ని ఆశ్రయించింది, — ఏమిటంటే నేను వారిని కోరుకోకపోవడం.

జ—చెప్పొచ్చావు పోవమ్మా! ఆయన నిన్ను కోరుకున్నాడు. ఒకపక్షాన్ని కోరిక ఉంటే చాలు. వివాహం అంటే, ఇరుపక్షాలవారూ చెరిసహం కోరుకుని బయల్దేరి మధ్యదార్లో కలుసుకోగూడదు. నీ నైజం పులుపు, అతడి స్వభావం మధురం. మంచిఫలం దక్కాలంటే, పులుపు రకాల్ని అంటుకడితేసరి.

కి—ఆయన్ని వరుడని అనడం నాకు అసహ్యం, భర్తఅని భావించడం మంట!

జ—అల్లాగా! ఏమోలే! వివాహం సాధారణంగా గొప్ప పరివర్తనం తీసుగొస్తుంది — కాని, కర్త్రీ దెబ్బకింద ఉండాలి వ్యవహారం—అతణ్ణినువ్వు స్వీకరిస్తావా స్వీకరించవా?

కి—నేను మీమాట జవదాటను విషయం ఇదితప్ప మరేదీ ఉండదు.

జ—నాన్నకి మనశ్శాంతి అనేది ఉండాలంటావా?

కి—ఓ! ఒక్కగాని ఒక్కకూతుర్ని దిక్కుమాలిందాన్నిగా చేశానే అనే పరితాపం నాన్నని పట్టుగోకుండా ఉండేటంత మనశ్శాంతి నాన్నకి ఉండాలంటాను.

జ—సరే, సరే, అయితే, అమ్మాయి జాగ్రత్తగా విను. ఇంతటినించి నీకు బుద్ధిగలిగే పర్యంతమూ నీమొహం

చూడను, నీతో మాట్లాడను.—మరేవిగా సమాధానంవద్దు, నోరుముయ్ – ఇది, లేకపోతే నీగది, ఈ వోట్లే నువ్వు మసలాలి. నీగదికి తాళం వెయ్యకుండా నేను ఇంట్లోంచి బయటికి అడుగుపెట్టను. నేను యింట్లో ఉండే టప్పుడుకూడా నాగదిలోంచి తప్ప నీదగ్గిరికి ఒక్క పిట్టేనా రావడానికి వీల్లేదు. ఎవరి పెంకితనం ఎక్కువో బోధపడుతుంది. ఫో అవతలకి, నా కంటపడకు – నీ విధి నీకు తెలియనీ.

(అని, కిశోరిని LM కి గెంటేస్తాడు.)

ప—నాన్నగారూ! ఈ తరహా వ్యాపారంలో నా సోదరి అభిప్రాయం ఎటువైపు మొగ్గుగాఉందో గమనించి తీరాలండి. అదీగాక, మణి నా ప్రత్యేక స్నేహితుడు గనక అతనియెడలకూడా కొంత మన్నన చూపించాలి.

జ—అవు నవును. నీ ప్రత్యేక స్నేహితుడు! అది అతడికి గొప్పసిఫార్సే! పాపం! ఆవిషయంలో నేను తగి నంత మర్యాద చూపించలేకపోయాను.

ప—అల్లా చెప్తా రేమిటి నాన్నా! బతికున్న వాళ్ళలో నాకు బావగారు ఎవరు కావాలంటే మణే అంటాను నేను.

జ—అసాధ్యం కాకపోవచ్చు. నా కూతురు కాని పిల్ల ఎవత్తేనా నీకు మరో చెల్లెలుంటే, దానికా సంబంధం కేటాయించెయ్యి, నేను నోరెత్తను. కాని, ప్రస్తుంతలో, దయచేసి, ఈ విషయం ముచ్చటించడం మరి మానేద్దాం.

ప—కాదు నాన్నగారూ! తోడబుట్టినివానియందు నాకుగల మన్ననవల్లే నే నింతదూరం మాట్లాడాను.

జ—చాలాసంతోషం. మరి మిమ్మల్ని ప్రార్థించే దేమంటే, ఇక కన్నతండ్రియందు మీకుగల మన్ననవల్ల ఇంతటితో మీరు గట్టిగా నోరుమూసుకోండి.

ప—చిత్తం. అయిపోయిందండి. మరొక్క విజ్ఞాపన చేసి మరీ ఆగుతాను. తమరు మా యీ డప్పుడు, ఇప్పు డెవర్ని మీరు రొకాయిస్తున్నారో ఆ అమ్మాయి తల్లిమీద మీకు మనస్సు గలిగి నప్పుడు ఎవ రేనా మీకు అడ్డొస్తే ఏమనిపించి 'ఉండేదో ఒఖ్ఖరవ్వ విచారణ చెయ్యవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాను.

జ—బస్! అదిటోయ్! సరే, మీ అమ్మకి చాలా ధనం ఉండేది. నేను ఆవిడ ధనాన్ని ప్రేమించాను. అంతే మరేమిటుంది? ఆవిడ ఆస్తికోసం ఆవిణ్ణి పెళ్ళాడాను. వాళ్ళనాన్న కోరికప్రకారం ఆవిడ నన్ను అంగీకరించింది. మాది మహా అనుకూల దాంపత్యం అనేవారుకాదూ! వారి మీద వీరి కెంతప్రేమ, వీరిమీద వారి కెంతప్రేమ అంటూ మేం ఆశలే పెట్టుగోలేదు. అందుకని మాకు ఆశాభంగాలు కలగనేలేదు. ఎప్పుడేనా కాస్తంత కోపతాపాలు వచ్చినా క్షణంలో మళ్ళీ సర్దుకునేవాళ్ళం. దెబ్బలాట సరదా మా కిద్దరికీ ఉండేదకాదు. మరి ఆ యిల్లాలు గతించి నప్పుడు — నేను, అయ్యో! ఈవిడ ఇంకా కొంతకాలం ఉండటం లేదే

అని దుఃఖించాను. ఈ ఊళ్ళో ప్రతీ అభార్యుడూ అల్లా దుఃఖించగలడేమో కనుక్కో చూస్తాను. ...ఇక నేను వెళ్ళి అమ్మాయి గదికి మంచితాళం తెస్తాను. నువ్వు సుపుత్రుడివి గనుక మీ చెల్లాయికి ఏదేనా ఆజ్ఞా తిరస్కరణం గురించిన గంభీరోపన్యాసం ఇస్తావేమో పాపం త్వరగా తెముల్చు ఉన్న వ్యవధిలో వీలైనంత ఉపదేశంచెయ్యి, విన్నావా?...

(అని LM కి మొహం తీవ్రంగాపెట్టి వెళ్తాడు)

ప—ఔర! ఇక ఈ సంబంధం గురించి నా స్నేహితుడు నభోమణి నీళ్ళు వదులుకోవలసిందే. కాని కిశోరి గట్టి పట్టుగలది. నాన్నగారికి తిక్క మిక్కుటం అయినకొద్దీ అమ్మాయి మక్కువ ఎక్కువవుతుంది. తమకే తెలియకుండా ఎవరు మనకు బాధకలిగిస్తారో వారంటే మనం అసహ్యించుకోడం ప్రకృతిసిద్ధం. ఇది లోకంలో సాధారణ విషయాలలోనే. కాని, హృదయ వ్యాపారాలలో స్త్రీ తను ఎవరి గురించేనా బాధపడవలిసి వచ్చేవరకూ అంతగా వారిని ప్రేమించదు. బాధపడవలిసివచ్చినకొద్దీ వారిని మరీఆసక్తితో ప్రేమిస్తుందికూడానూ!

(LM నించి గోలవినిపిస్తుంది)

—(LM కేసి చూసి) ఓహోహో! ఏమిటిచెప్మా, ఈ గోల-మానాన్న ఎందుకోగాని, అమ్మతల్లిని కేకలేస్తున్నాడు. నేను ఇల్లా (RM కి చూపిస్తూ) తప్పుకుంటాను. (RM కి గబగబా వెళ్ళిపోతాడు.)

[L M నించి జలేశం, కుడిచేతులో ఉత్తరం పట్టుకుని, ఎడంచేత్తో అమ్మతల్లిని ఈడ్చుకువస్తూ]

జ—ఎంతాశ్చర్యం! ఎంతాశ్చర్యం! పిడుగుపడ్డట్టైంది. ఎంత మోసం, ఎంత మోసం! పసికట్టినట్టు! నువ్వా నభోమణిగాడి మనిషివి. మా అమ్మాయి లేచిపోవడం పన్నాగంలో ప్రధాన నిర్వాహకురాలివి. ఎంతొచ్చిందీ, నిన్ను ఉత్త దిష్టిపిడత నుంచినట్టు ఉంచినందుకూ!

అ—ఏమిటయ్యా!

జ—ఏమిటా? దిష్టిబొమ్మ! ఏ యేపిట్టలువాల్తాయో ఋజువు చెయ్యడానికి! ఇప్పుడు నువ్వు నిన్ను ఎల్లా వెనకేసుకు రాగలవో చెప్పు.

అ—సరేస్వామీ! నన్ను తమరు బరిమీద పట్టుకుని ఈ ఉత్తరం ఊడలాక్కున్నారు. నా మనోవ్యాపారాలు పోల్చేసుకున్నారు. ఇప్పుడు మరి నేను అల్లాంటివి లేనట్టు మాట్టాడ్డం ఎందుకొచ్చినపనీ! నేను మణిగారి మనిషిని. మీ అమ్మాయి మీకుచేసిన శాస్తి బాగాఉంది. మీబోటి నిరంకుశపు తాగుబోతు లందరికీ అల్లానే కావాలి! కోమల ప్రేమలంటే నాకెంతో ఆనందం. వాటి ప్రభావంకింద ఉన్న వాళ్ళంతా నాకు స్నేహితులు.

జ—ఓసి అమ్మవారా! నీకు కోమల ప్రేమలంటూ కూడా ఉన్నాయి? నీ ముఖలక్షణాలు దుర్భేద్యంగదా, వాటిల్లోంచి కోమల ప్రేమభావాలు నీలో ఎల్లా ప్రవేశిం

చాయీ అంటూ! ఎంత కేనా తగుదువే, ముసిలి మోసకత్తె! అమ్మాయి నవయావనంలో ఉంది. ఆ కుసుమానికి కాపలాగా ఉంటావని, నిన్ను ముళ్ళకంచెని ఉంచినట్టుఉంచాను. పెనుభూతంలాంటి నీవైఖరి చూడ్డంతోటే శృంగారపురుషులు చెల్లాచెదరై పోతారనుకున్నాను. నీముఖంమీద ఏమడత చూసినా ఇనపబోనూ, మరతుపాకీ స్ఫురిస్తాయిగదా అని భ్రమించాను—సరే సరే! తక్షణం నా యింట్లోంచి దయ చెయ్. కోమల ప్రేమలుట! ఛీ! నా యింటోంచి విరగడైపో! ముంజూపు యోధులారా! పరమ చపలచిత్తే!

అ—ఓయి, నీచరకపు తిట్లమారి ముసలివాలకపు—ఎవడవో ఆ మాటలని నా నోరుకూడా పాడుచేసుగోడం ఎందుకూ? ఓయీ, మృగమా, నీ గుహలోంచి నేను పోతాను. కాని నా బట్టా పాతా ఆట్టేపెట్టేసుగుంటావా ఏమిటి? నావస్తువులు కొన్ని ఉన్నాయే మరీ!

జ—నిన్ను వేషంమీదే పట్టుగుంటినిగా! ఏం సంగ్రహించా వేమిటి?

అ—అయ్యా! నేను అమ్మాయిగారిదగ్గిర సెలవు పుచ్చుగోవాలి. ఆవిడదగ్గిర నా సొమ్ములు దాచుగున్నాను. పైగా, నా పైకప్పుదుస్తులూ వేలిముసుగులూ ఆవిడగదిలో ఉన్నాయి.

జ.—(వెకిలిగా నవ్వుతూ) నీ మేలిముసుగు వస్త్రాలా? ఓయి దేవుడా ! అవి లేకుండా నువ్వొడుతూంటే నీముఖంయొక్క అందం తలోకాస్తా జుర్రుకుంటారని నీకు భయంగావును, పాపం ! సరే వెళ్ళు. వెళ్ళి పైకప్పు వస్త్రాలూ, మేలిముసుగూ తెచ్చుకో. అంతే ! అయిదు నిమిషాలు తిరక్కుండా నువ్వు నా గృహంలోంచి విరగడైపో. చూస్తావేం, అల్లా, వెళ్ళు లోపలికి.

(అమ్మతల్లి L M కి నిష్క్రమిస్తుంది)

ఎంత చక్కగా పన్నారో ఆల్లరివల ! ఇవీ కూతుళ్ళ వల్ల సౌఖ్యాలు ! కూతురు ఉందీ అంటే, జన్మకి యమచర. మనశ్శాంతి మృగ్యం. ఇరవైయేళ్ళు రాకుండానే తండ్రి బోధించిన ధర్మం హుష్ అయిపోతుంది. అయ్యో, పెంకి కూతురైతే అడిగారూ—నిట్టూర్చడాలూ, మూలగడాలూ, చిక్కడాలూ, జీర్ణించడాలూ—కాల్చుకు తినేస్తుంది. యమ చర. ఇల్లా వయస్సు వచ్చిందో, రాలేదో అనుకుంటూండ గానే తండ్రిని డింకాకొట్టించే తెలివి బయల్దేరుతుంది. అక్కణ్ణించి వరుళ్ళు, ఉత్తరాల ప్రత్యుత్తరాలతో తండ్రికి మొహం మొత్తిపోతుంది. తండ్రి తెచ్చిన చక్కటి వరుడు బలాదూరై పోతాడు. పెంకికూతురైతే తరవాయి ఉండి పోతుందా—పోట్లాటలు, కాట్లాటలు—మూతివిరుపులు, ముక్కువిరుపులు—బాబో, యమచర.

(కిశోరి LM నించి అమ్మతల్లి వేషంతో, పైవస్త్రం
కప్పుగుని ముఖం ముసుగు వేసుగుని, శబ్దం
లేకుండా ఏడుపు అభినయిస్తూ వస్తుంది]

[RM కేసి చూపిస్తూ) ఇల్లా నమోన్మాయ్, గ్రంథ కర్త్రి, ఇదీదారి. నాదీపూచీ, ఉద్వాసన బహుకోమలంగా ఉంది. ఓహోహో! ఏడుపుగుడానా, నీకూ! ఆ కర్ర చెక్కిళ్ళమీద కన్నీళ్ళు ప్రవహించడానికి కర్పూరం రాచుగున్నావా ఏమిటో ఓవిడా! – (కిశోరి మెడ అటుతిప్పగా) అంతకన్న ఏంచెయ్యగలవు పాపం! మొహం చాటేసుగుంటున్నావు. అల్లా ఊహూ కుసిళ్ళుతూ ఉన్నావంటే గుండెపగిలి ఇద్దైపోతావు, జాగర్త. క్షమాపణ, గిమాపణ చెప్పడానికి నిన్ను నోరెత్త నివ్వను. అల్లామూగామ్మవారులా ఉండి పోవడమే భేషుగ్గా ఉంది. ఇల్లా నడు. ఇల్లా సాగు. ఇల్లా దయచెయ్!

[అని RM కి కిశోరిని సాగనంపి తను కూడా వెనకాలే వెడ
తాడు. వెంటనే LM నించి అమ్మతల్లి ప్రవేశిస్తుంది.]

అ__ఓహో! జలేశజ్ఞానీ! నీకు మేలు కలగాలని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను. ఆహా! నిశ్చిలప్రేమయొక్క ఆసక్తి వల్ల కలిగే ఫలితాలు అపరూపంగా ఉంటాయి! మరి నేను వెళ్ళి ఆరిందా నారీమణినై నా యజమానురాలులాగ నటిస్తాను. ఈ నటనలో నెగ్గుతానా, నేనూ నిశ్చయంగా ఆరిందానారీమణినే అవుతాను, జన్మకష్టంతీరి పోతుంది, ఆలస్యం

చెయ్యకుండా వెళ్ళి గది పట్టి ఆరిందాలమ్మాయి వేషం ధరిస్తాను. (LMకి తొందరగా వెడుతుంది.)

రెండో తెర పడగా, RM నించి విశాల వస్తుంది.]

వి—(తనలో) సవితి తల్లి పోరు పడలేకా, ఎంత ప్రియుడైతేం వరుడు వచ్చి వేళగాని వేళ శృతి మీరడంవల్ల నేను పొందిన లోకువ భరించలేకా, ఇంట్లోంచి ఇవతలకీ వచ్చేశాను. ఉన్న సొమ్ములన్నీ తెస్తానని, దాసీది వెనక్కి-వెళ్ళి, ఇంకా రాలేదు. పరిధానంగారు నా కోపం బాగా హెచ్చు చేశారు గనక, ఆయన దగ్గిరికి వెళ్ళను. మరిఎక్క-డికి వెళ్ళనూ? కిశోరిని కలుసుగుందాం అంటే. కిశోరికి పితృ భక్తి మెండు. నన్ను చివాట్లు పెట్టచ్చు, లేక నన్ను యాగీ చేసి బయట పెట్టెయ్యచ్చు. ఏమిటి నాకు దారి? పోనీ గోమాత దగ్గిరికి పోతాను. దాసీది వస్తుందేమో చూడాలి ఏదార్ని వస్తుందో. (అని L F కేసి జరిగి వెడుతుంది.)

[RF నుంచి వేషంలో కిశోరి ప్రవేశించి]

కి—అమ్మయ్య! ఇంట్లోంచి గెంటయ్య బడడంలో కృతార్థురాల్ని అయాను. బాగానే ఉంది. మరి యిప్పుడు మణిని కలియడం ఎల్లా? నేను అతడి వయినం వాకబు చెయ్యడం మొదలెడితినా పట్టుబడి పోతాను. పోనీ విశాలకి కబురు చేద్దాంఅంటే విశాలదంతా అతివినయం. ఏమంటుందో? (L F కేసి చూసి) ఏమి అదృష్టం! విశాలలాగ ఉందే! విశాలే! విశాలా?

వి—(ఆశ్చర్యంతో) కిశోరీ! మారు వేషంకూడా వేశావే? ఆశ్చర్యంగా ఉందే!

కి—ఇదే మాశ్చర్యం! ఇంకా ఆశ్చర్యపడు, విని—నేను మా యింట్లోంచి పారి పోయివచ్చాను.

వి—నిజంగా ఆశ్చర్యమే! ఈ పనిగురించి నేను నీకు ఓ లెట్ట వరస ముట్టచెప్పి ఉండే దాన్ని! వచ్చిన చిక్కే—మి టంటే, నేనూ మాయింట్లోంచి ఇప్పుడే లే వొచ్చాను.

కి—అయ్యో నా విశాలా! (అని విశాలను కౌగిలించు కుంటుంది)

వి—అయితే, ఇల్లు వదిలిన సోదరీ! ఇప్పుడు ఎక్క—డికి నువ్వెళ్ళడం?

కి—నా వదినె దగ్గరికి! నువ్వూ— మా అన్నని కలుసుకోడం నీకు అయిష్టం కాదని భావిస్తాను.

వి—కలుసుకోవలసిందే కాని, ఆయన ఇందాకటి ప్రవర్తన తల్చుకుంటే, ఆయన్ని నేను క్షమిస్తానని అనుకోను.

కి—అంటే?

వి—అంటేనా! పగలల్లా అన్నం సయించక, రాత్రెల్లా నిద్రపట్టక నేను పరితాపం పడిపడి శరీరం శయ్యార్పణం చేసి ఎల్లానో ఓ కంటితో ఓ కునుకు పోతూంటే, ఈయన గిమ్మ్రుముని నాగవలోక చొరబడి, నన్ను దగ్గరికి

తీసుగుని, రక్షించడానికే వచ్చాననీ దాస్యవిమోచనం చేస్తాననీ శపథాలు చేస్తూ మోకరించి, చుంబించి, నానా ఇదీ చేసేశారు. నేను ఆయన్ని కసురుగుని పంపేశాను. ఎంచేతంటే, అప్పట్లో ఆయన కనపరచిన వైరి-దౌరవ చెల్లనిస్తే, నా హృదయం నా కెక్కడ స్వామిద్రోహం చేసిపోతుందో అని భయంవేసింది.

కి—ఇంత అపరాధం అతనివల్ల వచ్చినందుకు క్షమాపణ కోరుకునే నిమిత్తం, మా అన్నని నేనే నీ దగ్గిరికి పంపి ఉందును. కాని, నేను లేచిరావడం అతనికి తెలియ నివ్వ లేదు. మరి నీకేమిటి ఆశ్రయం?

వి—ప్రస్తుతం మఠాధికారిణి గోమాత అనేఆవిడ, నాకు బంధువూ, స్నేహితురాలూనూ! అక్కడ నాకు క్షేమం. ఆవిణ్ణే ఆశ్రయిస్తాను. నన్నడిగితే, నువ్వుకూడా అక్కడికి రావడం ప్రశస్తం.

కి—నేను రాను. నేను వెతికి మణిని పట్టుకుని తీరతాను. (అని LI' కేసి చూసి) ఉండుండు. అవును, నిజమే, నేను బతికున్నంత నిజం. ఇల్లా వస్తున్నాడు. ఎవడురా వాలో ఆమనిషే సరిగ్గా. ఇతణ్ణి నియోగించి మణిని కనుక్కుంటాను.

వి—(అటుచూసి) ఎవడువాడూ? వింతస్వరూపంలా ఉన్నాడే?

కి___అవును. ఈముద్దుల కుప్పనే మానాన్న నాకు భర్తగా చెయ్యదలిచాడు.

వి___నువ్వు వాడితో మాట్లాడతావా? నీకు మతి గాని పోయిందా?

కి___ నా పథకం పట్టివ్వాలంటే, ఇక్కడే మిక్కిలి అర్హుడు. ఇంత అర్హుడు మరి భూమ్మీద ఉండడు. ఎందుచేత అని అడగవేం, పెళ్ళికావలసినిగోజు రేపే అయినా, ఈ ఊళ్ళోకల్లా ఈయన చూడకుండా ఉంటూ నన్నే.

వి___ఆయన్ని నువ్వెల్లా ఎరుగుదువు మరీ?

కి___నిన్న మా యింటికొచ్చాడు, మా నాన్నతో కూచున్నాడు. కిటికీలోంచి చూపించారు ఆయనకినన్ను.

వి___అయితే మరి నేను పోతాను.

కి___ఆగు, విశాలా!___ఒక అభిప్రాయం ఇప్పుడే తట్టింది. నువ్వు కాస్త అనుమతి ఇవ్వాలి. – అవసరాన్ని బట్టి నీపేరు నేను పెట్టుగోడానికి.

వి___నాపేరా? నీకు అప్రతిష్ఠకూడానూ! కావలిస్తే నీయిష్టం, అల్లానేకానీ మరి నేను ఆగను (వెళ్ళిపోతూ) కాని, కిశోరీ, నువ్వు మీఅన్ననిగాని కలియడం తటస్థిస్తే, ఆయనతో నా సంగతి ఏమీ చెప్పవద్దుస్మీ–నేను గోమాతని ఆశ్రయించడం, ఆవిడ మఠాధికారిణి కావడం, ఆమఠం చదరపు మైదానం పడమటివైపు రెండోవరసలో ఉండడం–ఇవేవీ చెప్పకు.

కి.—(నవ్వుతూ) ఓ, అద్దమా! నిన్ను కనుక్కో కుండా ఉండడానికి. నువ్వు చెప్పిన వయినాలన్నీ తూచా తప్పకుండా చెబుతాను. (విశాల RF కి వెళ్ళిపోతుంది.)

—ఇదుగో, మన నాటురకం కాముకుడు, తన్ని చూసుకుని పొంగిపోతూ ఇల్లా (LF) వస్తున్నాడు - ఇసక పుట్ల మండోదరం!

[LF నించి అద్దంలో అందం చూసుకుంటూ మండో దరం వస్తాడు. వెనకాలే కరాళం ఉంటాడు.]

మం.—ఉయేయ్! కరాళం! నా అభిప్రాయం నువ్వు వినాలి. నా ముఖంయొక్క అడుగుకొనని కొంత గడ్డం విజృంభించి నప్పుడే నా కెక్కువ సంతోషం కలిగే టట్టు ఉంది.

క.—అయ్యో నా ప్రియస్నేహితుడా! ఇల్లాంటి మొహంతో ఉంటే నిన్ను ఆడది మెచ్చుకుంటుందని, ఏ మొహం పెట్టుగుని అనుకోగలవు?

మం.—ఏం? నిక్షేపంలా మొహం ఉంటే, మొహాని కేంరోగం? ఇల్లాంటి మొహంమీద కన్నుపడిందీ అంటే దృష్టి ఇందులో గుచ్చుకుపోయి చచ్చినా ఊడిరాదు కుడానూ! ఇక నా గడ్డం అందంగురించి ఇష్టపడని ఆడ పుట్టుపుయొక్క అభిరుచి ఎంత నీచం అనాలో నేను చెప్ప లేను (RF కేసి చూసి) అదుగో, చూడు. అప్పుడే ఒక

నారీమణి నా గడ్డంవల్ల అకర్షింపబడి ఆగిపోయిందో లేదో కనుక్కో, నాప్రాణం పండెం.

క—స్వామీ! మీ సహాయం మిక్కిలి కాంక్షించి ఉన్న ఒక నారీమణిమాట మన్నించే టందుకు మీ రిప్పుడు స్వస్థచిత్తులేనా? (అని వేషం తొలగిస్తుంది)

మం—ఓయిబాబో! ఇవేంకళ్ళోయ్, కరాళం, చేపల్లాగ! చక్కని చుక్క! బహుశ, కరాళం, ఈభామకి నామీద భ్రమకలిగినట్టుంది. కాబట్టి, మొట్టమొదట, కాంతా! నీ నామధేయం మాకు దయచేయవలిసిందని నా విన్నపం.

కి—నా పేరాండి, నా పేరు విశాల.

మం—రాజారావు కూతురువి విశాలవి కావుగద?

కి—ఆయన కూతుర్నే నండి.

మం—నిజంగా! ఆయన కూతురు తప్పిపోయిందని ఇప్పుడే విన్నాను.

కి—కాని, అయ్యా! మీఅంత శృంగారమూర్తులు, గౌరవనీయులు, నమ్ముకున్న నాకు ద్రోహం చెయ్యలేరు సుమండి. నా నేరమల్లా ఏమిటీ, ప్రేమ.

మం—(నవ్వుకుంటూ) అల్లానుటే! అల్లానుటే! నాకోసమని ఎంతప్రేమ వహించావే వెర్రిపిల్ల కానా! అయితే, ఓ అమ్మాయి—నిన్ను నమ్మించి ద్రోహం చెయ్య డానికి మాకేం ఒలుకుతుందిగనకా! అంచేత ఆ భయం

లేదు. నువ్వు నా గౌరవంగురించి నమ్మొచ్చు. నాగౌరవం చాలా పెద్దలెఖ్ఖల్లో జమ. కాని, పాపం, నువ్వు నామీద ప్రేమగురించి చెప్పావే, ఆ విషయంలో శుద్ధ సిరాశే నీకు రాసింది.

కి.—ఎందువల్లనండి, స్వామీ ?

మం.—మరొకర్నిగురించి నేను, గాఢంగా కట్టుబడి అయిపోయాను కాబట్టి!—కాలేదుటోయ్, కరాళం!

కి.—కాదుకాదు, ఒఖ్ఖమాట వినండి.

మం.—ఎంతమాత్రంకుడా వినను. వింటే ఆ విన్న దంతా ఏంజేసుగోనూ, పారెయ్యాలి! నిన్ను సగౌరవంగా ప్రేమించడం మొదలైనవి ఇప్పుడు అసంభవంగదా! 'అది కాదండి, మరోహామోస్తరండి నేచెప్పేది' అంటావనుకో, నేను మెత్తబడ్డాననుకో. ఆమట్టున చర్రుమని జువ్వలాగ లేస్తాడు—ఎవడో ఏకృతఘ్నుడో నీకుంటారుగా—ఏఅన్నో, తమ్ముడో, దగ్గిరవాడెవడో ఒక దిక్కుమాలిన ఘటం! లేచి బయల్దేరి ఇంత మర్యాద ఉందిట్రా నీదగ్గరా అనిచెప్పి కత్తి పుచ్చుగుని నన్ను ఒఖ్ఖటేశాడంటే, నాబుర్ర పిటకారెడుతుంది చల్లగాలికి, మొండెం ఇక్కడే ఉంటుంది! అందుకని, అమ్మాయోయ్, నీకు పుణ్యం ఉంటుంది శీఘ్రుంగా ఇంటికి దయచెయ్.

కి.—(తనలో) ఓరి కుళ్ళుపుట్టా! (పైకి) కానండి, స్వామీ, నేను లేచివస్తా నభోమణిగురించండి.

మం.—ఎట్లా ఎట్లా! ఏమిటేమిటీ? అలాయితే నువ్వా నన్ను గురించి కాదూ మోహంలోపడతా?

కి.—అబ్బే! బొత్తిగా కాదండి.

మం.—అయితే నువ్వు కళ్ళుమూసుగుని వొరగబడే పొగరుమోతు మూర్ఖురాలివి! కాబట్టి, మీనాన్నతో ఇది యావత్తూ చెబుతాను.

కి.—ఇంతటి పీరులేనా మీరూ?

మం.—ఆగాగు! నభోమణిఅని కాదూ అన్నావు? నభోమణి—ఈపేరు... దైవమా, ఈసంగతి ప్రయోగించి ఏదేనా లాభం లాగచ్చు, స్వాంతానికి...నభోమణి...

కి.—అవును. మీరు మీప్రేమలో రాణించాలంటే నన్ను ఆయనదగ్గిరికి చేర్పండి.

మం.—ద్రోహదేవత సాక్షిగా, అల్లానే చేదస్తాను. కరాళం విన్నావా, ఈ నభోమణిగాడున్నాడే, వీడేట— ఆ కిశోరివిషయంలో నాకు పోటీ. వాడికి ఈపిల్లని తీసిగెళ్ళి ఎరపారేస్తే, నా ప్రేమరంగంలో నేనొఖణ్ణే మనిషిని అవుతాను. (నవ్వుతూ) చెప్పవోయ్, కరాళం! ఈ భావం తోచడం ఎంత అదృష్టం అంటావు?

క.—చాలా అదృష్టం అండి, ఎంతో అదృష్టం, చచ్చినంత అదృషం.

మం.—(తన బుర్ర చూపెట్టుగుంటూ) ఈ చిన్నారి బుర్ర ఎప్పుడూ వొట్టిపోదు (అద్దం చూసుగుంటూ) ఓరి

ఎంత జిత్తులమారివిరా మంఃడోదరం! నీ తస్సాదియ్యా. ఏమి నక్కజిత్తులురా నీవి పుంభాకోర్! ఏమమ్మోయ్ శ్రీమతి విశాలా! నాంస్నేహితుడు నీకు కొన్ని సూచనలు చేస్తాడు, నువ్వు నమ్ముతావా, ఇతణ్ణి!

కి—ఆయ నెందుకండీ మధ్యా? మీరే మహ నీయులు, మిమ్మల్నే నమ్ముతాను.

క—నారీ! నేనుపూాత్రం! నేను నిన్ను దగా చెయ్యడం కేవలం అసంభవం. ఒకవేళ నాది అబద్ధమే చెప్పుతూండే ప్రకృతి అయినా, నేను నీకు హాని చెయ్యలేను. నీమాటలు విశేషం గొప్పతనాన్ని సూచించవు గాని నీ మహిమలు నాచేత నిజమే పలికిస్తాయి, ఏ జీవుడూ నీయెడల మోసం వహించడు. ఏపరాయివాడూనీకు చెడు చెయ్యడు. నిన్ను కలిసిన వృద్ధులంతా నిన్ను స్నేహిస్తారు, యువకు లంతా ప్రేమిస్తారు. కాని నీహృదయార్పణంతో మరొకర్ని ధన్యుల్ని చేశానని, ఆ యువకులికి తెలిసినప్పుడు కుడా, ఆశపై ఆశతో చెలరేగుతూండే వరభావాన్ని వాళ్ళు అరి కట్టుగుని సోదరభావం నీపట్ల వహిస్తారు. కాబట్టి ఓ అమ్మాయి, నావిషయంలో మోసం గురించి భయపడకు, చెడుగురించి వెరవకు.

మం—కరాళం! ఈ యువతిని నా భవనానికి తీసుకు పద! నేను జలేశం ఇంటికి పరిగెట్టాలి. ఏమమ్మాయి నువ్వు గాని ఆ కిశోరని ఎరుగుదువా? ఆ అమ్మాయి సౌందర్యం దేవలోక సౌందర్యం! ఏమంటావు?

కి—నేను తమతో ఏకీభవించజాలనందుకు, తమరు నన్ను క్షమించాలి.

మం—ఏం? నేను ప్రతివాళ్ళ నోటంటా అల్లానే విన్నానే!

కి—అబ్బే! వాళ్ళనాన్నకి ఆ అమ్మాయి గురించి వల్లమాలిన పక్షపాతం అండీ! నామాట నమ్మండి, మీరే చూద్దురుగాని, ఆ అమ్మాయికి ఇళ్ళపెత్తనం చేసే ముసలమ్మలుంటారే, ఆ వాలకం ఉంటుంది.

మం—చూశావోయ్ కరాళం, ఇదే చుప్పనాతి గుణం అంటే! ఈ డొచ్చిన పిల్లలుంటారా, ఒకళ్ళని గురించి మరొకళ్ళు యుగం తిరిగినా మంచిమాటాడరు. (కరాళంతో) విన్నావా? నభోమణిని పట్టుగోవాలి. ఈ తుట్టని తీసిగెళ్ళి వాడికి అమర్చేస్తాను. అబ్బో అబ్బో! ఈ భావం ఎంత అదృష్టవంతం! శ్రీమతి విశాలా! పరమ విధేయుణ్ణి, కరాళం! నీపనిమీద నువ్వుండు.

నా కాంతదగ్గిరికి వెడతాను. కనిపెట్టుగుని ఉంటుంది నాకోసం. వెళ్ళకుండానే ఎట్లా ఆశించగలను ఆవిడ మందహాసం?

కి—శీఘ్రమే మీరు ప్రేమవిజయం సాధించి రావాలని ప్రార్థిస్తున్నాను. ఈ లోపున నేను పడే బాధగురించి కొంచెం చింత చెయ్యండి—ఒంటరిని, నా వరుడుకి దూరం అయినదాన్ని, పరాయివాళ్ళని నమ్ముకోవలసి వచ్చినదాన్ని.

మం—ముద్దుగుమ్మా! నా స్నేహితుడైన యితణ్ణి నువ్వు విశ్వసించు. త్వరలోనే తేల్తుంది, ఇతడు సేవకుడు, సంరక్షకుడు, మార్గదర్శి—అని.

క—ఓ కోమలీ! అయ్యో! నన్నా శంకిస్తున్నావు? మొదట నాసేవ స్వీకరించు, తరువాత కావలిస్తే నన్ను విసర్జించు. కాస్త నమ్మకమే ఉంచలేవూ? నిన్నా నేను మోసగించడం? ఇదివరకే నువ్వు దుఃఖంలో ఉన్నావా, అది చాలక నేను నిన్ను ఇంకా దుఃఖపెడతానా? ఓ లతాంగీ! నాదాస్యం పుచ్చుగో నచ్చకపోతే నౌఖరీ తీసెయ్.

కి—(మండోదరంతో) నాయెడల మీరు ఏమి ద్రోహం తలపెట్టినా మీకు సౌఖ్యం ఉండదు.

మం—నీయెడల ఎవడు ఏవడు ఏమిద్రోహం తల పెట్టినా, వాడికి సౌఖ్యం ఉండదు.

క—నీయెడల నేను ఏమిద్రోహం తలపెట్టినా, నాకు సౌఖ్యం ఉండదు.

కి—(మండోదరంతో) నేచెప్పేది, మీమాట!

మం—నేచెప్పేది, ద్రోహిమాట!

క—నే చెప్పేది, నామాట!

(మండోదరం RF కీ, కిశోరి, కరాళాలు LF కీ వెళ్ళడానికి యత్నిస్తూండగా, తెర.)

---

# రంగం-2

[జలేశం యింట్లో ఒకగది. తక్కినయిల్లు ఎడమ వైపు. కుర్చీలమీద కూచుని జలేశమూ-మంజో దరమూ మాట్లాడుకుంటూ ఉంటారు.]

జ—విశాలే!

మం—ఆ.

జ—గాజూరావు కూతురే!

మం—ఆ.

జ—(వస్తూన్న నవ్వు నొక్కేస్తూ తండ్రిని వొదిలి లేచిపోయిందేం?

మం—ఒక్క దెబ్బని.

జ—(కొంచెం నవ్వుతూ) పాపం! గాజూరావు వెర్రివాడు!

మం—ఆ పై సంగతి వినండి. ఆ అమ్మాయిని నేరుగా తీసికెళ్ళి నభోమణికి అప్పగించవలసినవాణ్ణి నేను. ఇందు మూలంగా దాన్నిగురించిన బాదరబందీలో వాడు పడి ఉంటాడు గనక మీ అమ్మాయి విషయంలో గోమూరులా బాధించేవా డెవడూ నాకుండడు. ఇది మంచిఎత్తు, ఏమం టారు! జిత్తుతో కూడిన ఒక చక్కని తస్సా, ఏం?

జ—షస్టూ! ఒకటోరకం! అవు నవును. దాన్ని పట్టిగెళ్ళి వాడి నెత్తిని ఎక్కించు, సకలవిధాలా యత్నించి

(నవ్వుతూ) ఆ గాజూరావు ఎంత అమాయికు డనుకున్నావు! వొట్టి ముసలిమూర్ఖుడు. పిల్ల చేత ఇట్టే టోపీపడి ఊరుకున్నాడు !

మం—అబ్బో! యువతుల జిత్తులన్నీ పాముజిత్తులంటి! అదీ యథార్థమైనమాట!

జ—పోవోయ్! ఇవతలవాళ్ళు వొట్టి వాజమ్మలై తేనూ, వాళ్ళ జిత్తులన్నీనూ! ఎదీ, మా అమ్మాయిని నామీాద అల్లాంటిఎత్తు వెయ్యమను ఏంచేస్తానో! నా జాగర్తని మీారిపోయే కుయుక్తి పన్ననీమరీ! ఆమట్టున, హేం, ఏమనుకున్నావో! ఏమంటావు పొన్నారి మండోదరం! ఏమిటి నీ అభిప్రాయం?

మం—నిజం, నిజం! స్త్రీజాతి మొత్తంలో ఎవళ్ళనై నాసరే, వచ్చి నాకు టోపీ వెయ్యమనండి చూద్దాం. ఛస్తే, ఛస్తే, దైవకృపవల్ల. "మా జ్ఞానేశ్వర్ గాడికి (మా అత్తయ్య నన్ను చిన్నతనంలో అల్లా పిల్చేది) నక్కజిత్తులూ అవీ నక్కలకంటె బాగా తెలుసును" అంటోచ్చేది.

జ—మరే. అన్నిందాలా పరమహంస ఎవ డంటే మన గాజూరావే.

మం—ఆ వెర్రిబాగులవాడు నభోమణి ఒకమా అల్లాంటి రకం

జ—యథార్థం! ఇల్లాంటి చవటశిరోమణుల జోడూ ఎక్కడా ఉండరు. మరి చాలు, పద. మా అమ్మాయిని

చూడ్డానికి, వేళయింది. ఈ ముట్టడి నువ్వు ఒంటరిగానే నిర్వహించు గోపాలయ్యోయ్, మండోదర నేస్తం!

మం—మీరు కొద్దిగా పరిచయవాక్యాలు చెప్పి—

జ—వీల్లేదు. మాపిల్ల తన పితృతిరస్కరణం ఉప సంహరించుగుని దార్లో పడేవరకూ నేను దానిమొహం చూడననిన్నీ దానిఎదట నోరు విప్పననిన్నీ పెద్ద ఒట్టుతో సహా ఘోరప్రమాణం చేసేశాను. నువ్వుగాని దాన్ని ఒకుపుగా దార్లోకి తీసుగురాగలిగావా, దానికి తండ్రే లభిస్తాడు, భర్తాచిక్కుతాడు.

మం—ఓయి పాడుదేవుడా! ఆమె ఒంటరిగా ఉన్నప్పుడు వ్యవహరించడం నా తరంకాదు. సంపూర్ణ సౌందర్యంతో ముఖాముఖీ కాగానే నాకు కలిగే భయ భక్తులు మరి యే యితర సందర్భంలోనూ కలగవు. నన్నడిగితే కురూపత్వమే మనశ్శాంతికరంగానూ, ప్రోత్సాహ కరంగానూ ఉంటుంది. ఒకవేళ కన్య సౌందర్య శత్రువను కోండి. అయినా మండోదరం ఆ కన్యని విసర్జించడు. ముక్కుమీద కోపంగలది కాకుండా ఆ కన్య కాస్త రసజ్ఞురాలై ఉంటే చాలు. ఆరోగ్యంగలదైతే చాలు. నేను ఆ ఆరోగ్యంపేరట ద్రావకశాంతి చేస్తూంటాను. కన్య నిటాగ్గా ఉంటే చాలండీ, ఏకులాఉందా బుట్టబొమ్మలా ఉందా? ఆరడుగులా, నాలుగా? అంటూ పట్టింపులు నాకు లేవు.

వర్చస్సు ఎల్లాఉంటే ఏంములిగిపోతుందీ? నుతగగా ఉంటుందా, మరి మారదుగనక శాశ్వతం! కాస్త నేవళికంగా ఉంటుందా, అల్లానే కానీండి—అదీ అందమే. దవడలకి అక్కడక్కడ చిన్నచిన్న సొట్టలూ అవీ లేకపోతే పీడాపోయిరి అసలు ఆ కన్య నవ్వగలిగితే నాకు చాలు, ఆ మూతే వెయ్యి సొట్టలపెట్టు అనుకుంటాను. తీరిపోతుంది. ఆ కన్యజుట్టు జేగురో జాబరారంగో కానీండి, ఏమిటి లోటు! నేత్రాలు ఆకుపచ్చన కాకుండాఉంటే చాలుగదా, మరో వర్ణం ఏదైనా మంచిదే. కళ్ళకి తళుకులనీ, బెళుకులనీ ఊహలూ పేర్లెడతారుగాని నాకు దురాశ లేదండి. కళ్ళు రెండుమాత్రం ఉంటే చాలదుటండీ మజాకా చూపించడానికీ! ఆ అమ్మాయి వీపుమీద ఓక మూపరంకుడాఉన్నా అది చిన్న పెద్ద ఏరకం అయినా సరే, అది లేనేలేదనుకోగల్ను నేను. దంతాలూ పళ్ళూ నల్లగా ఉండడంకంటె తెల్లగాఉన్నాసరే ఎక్కువ నాజూకే. ఇక ముఖం కోలగా అడుగున మొనతేలి ఉండేకంటె వక్రంగా ఉంటేనేఅందంట. ఎక్కువోవిన్నాను. కానైతే ఒక్కటేపరతు—గడ్డంమాత్రం ఉండకూడదు.

జ—ఓయి, మందోదరం, మందోదరం! ఎల్లాంటి స్నేహితుడవయ్యా! మా కిశోరిని చూసిన తరవాత నువ్వు ఈ ధోరణి పిరాయించి తీరతావు.

మం—అయ్యా! జలేశమహాశయా! మీతో బాంధవ్యం అనే గౌరవం—

జ—అది సరేనయ్యా, పిల్ల అందం చూసేసరికి నీకు మళ్ళీ మాట మంతీ ఉంటేనా! అంటూన్న వాణ్ణి తండ్రి నైపోతేంగాని, అనవలిసొస్తే అననూ అనాలి—పిల్ల చాలా అఖండురాలు. దాన్ని చూసీచూడగానే ముమ్మూర్తులా నా మొఖమూ నాకళ్లూ కనిపిస్తాయి. (కొంచెం కులాసాతో) నిజమే, నమ్మతావో లేదో, అదొక మోస్తరు షోకేళా తళుకు! ఒక్కొక్కప్పుడు అదొక తమాషా తుంటరి బెళుకు! అచ్చంగా నేనే అనిపిస్తుంది.

మం—అయ్యో నాఅందాల కొంటీ!

జ—ఇంకా విను. నవ్వుతుందా, అప్పుడు చిన్న సొట్ట ఉంటుంది, ఒఖ బుగ్గమీదే. అందం అంటే అదే అందం. అప్పుడు సొట్టఉన్న బుగ్గ అందం ఎక్కువో సొట్ట లేని బుగ్గ అందం ఎక్కువో, చెప్పగోమంటే నువ్వు నీళ్ళు నమిలి ఊరుకుంటావు.

మం—అయ్యో నా అందాలకొంటీ!

జ—అప్పుడు సిగ్గు చిమ్మి ఒకమాదిరి ముఖమల్ పట్టుమీద గులాబిలు పరిచినట్టు ఆ చెక్కిళ్ళు కనిపించి ఆరోగ్య తేజానికి కొత్తసొగసు స్ఫురించుతుంది.

మం—అయ్యో నా అందాల కొంటీ!

జ—కూసం ఉన్నట్టుండే ఆజమిలి నేతదుస్తుయొక్క శోభ పసుపుచుక్కల మూలంగా మరీ చక్కగా కని పిస్తుంది.

మం—నన్ను మంత్రించేస్తుంది, ఆ అందాలకొంటి! ఆమెగాత్రం ఏవిధంగా ఉండుకుందో సెలవియ్యండి.

జ—గాత్రమా! అపహాపానందం కలిగిస్తుంది. ఇక ఎలానో అల్లా బలవంతపెట్టి అమ్మాయిచేత పాట పాడించావా, నీకు స్పృహే ఉండదు. కోకిలే అచ్చంగా, వసంత వనకోకిల! లే! లే! ఆదాసీది నిన్ను గదిదగ్గిరికి తీసుకెళుతుంది.

మం—సరేనండి! నేను నా ధైర్యాన్ని మేల్కొలిపి, ఆవిడ చిరికోపాల్ని సాహసంతో ఎదురుకుంటాను.

జ—ప్రేమోపోద్ఘాతం చురుగ్గా తెముల్చు. పిల్లదాని మనస్సు అపహరించు, నెగ్గివచ్చిన దాఖలా నాకు కనపర్చవయ్యా, చిన్నారి జ్ఞానేశ్వర్!

మం—ఒఖ్ఖసారి ఆగండి, నా స్నేహితు డొకడు, కరాళం అనే ఆయన ఇక్కడికి నాకోసం వస్తాడుగాని, అతడు రాగానే నాదగ్గిరికి అతణ్ణి పంపండేం?

జ—అల్లానే, ఒసేవ్ లారీ, లారీ!—(అని L F కేసి తిరిగి కేకెట్టి) రావయ్యా, ఆ దాసీది నిన్ను ఆ గదిదగ్గిరికి తీసుగెడుతుంది. (అని L F కి నడిచి వెడుతూ, వెనక్కి తిరిగి మండోదరాన్ని చూసి) అదేమిటోయ్! అల్లా దిగజారి పోతున్నావేం, తుమ్మల్లో పొద్దుకూకినట్టూ! (అని L F కి నిష్క్రమిస్తాడు)

మం—(వెనకాలే కాళ్ళీడుస్తూ వెడతాడు)

రెండో తెర పడుతుంది)

[మండోదరం L నుంచి లోపల R వైపు తిరిగి RM
'నుంచి వచ్చి రెండో తెర ఎదట నిలబడతాడు.]

అక్కడకీ దాసీదాన్తో చెప్పిచూశాను. అమ్మాయిని తొందరపెట్టకే, తీరుబడిగా ఉన్నప్పుడే చూస్తానే, సావకాశంగానూ, అని. అంటే అది అమ్మాయిగారు తక్షణమే చూస్తాం అన్నారండి, అని చెప్పింది. ఇల్లాంటి ప్రేమ చూపులకి పనికొచ్చేటట్టు రంగం ఒకటి వెనకే నేను అభ్యాసంచేసి తరిఫీయత్తై ఉండవలసింది. పప్పులో కాలేస్తానని అప్పుడే హడలు బయల్దేరింది. విచారణ స్థలానికి ముద్దాయిగా వెళుతూన్నా ఇంత భయపడి ఉండను. అదుగో తలుపుతీసిన చప్పుడు. ఆ. వస్తూంటుంది. ఆ అమ్మాయి పట్టు దుస్తులు కదలినా నాకు కంపరమే.

[రెండో తెర లేస్తుంది. రెండుకుర్చీలుంటాయి కిశోరి వేషంలో అమ్మతల్లి LM నించి వచ్చి ఎడమవైపు కుర్చీదగ్గర నుంచుంటుంది. మనిషి రావడం కనిపెట్టి మండోదరం తెర కేసి వీపుపెట్టి ఎదరకి జరుగుతాడు.]

మం—ప్రాణం పోతుంది బాబూ. అటుతిరిగితే!— ఆ అందం ఒక్ఖదెబ్బ కొట్టిందంటే, నాకు మాట పడిపోతుంది. ఆపిల్లే మొదట మాట్లాడితే బాగుండును.

అ—స్వామీ! తమ ఆనందం సెలవియ్యండి.

మం.—(తనలో) అమ్మ! ఆ పిల్లే ప్రారంభంచేసింది బాబూ! ఆ ప్రారంభంకూడా చాలా మర్యాదగాఉంది (పైకి! సకిలించుతూ) అమ్మా!—అమ్మాయీ! నేను చాలా విధాయకంగా ఉన్నాను.

అ.—అబ్బే, అదేమి మాటండీ! వినవలసింది నేను, అనవలసింది మీరు.

మం.—(తనలో) ఓరి దేవుడోయ్! ఈ మాటా పాడుగాలేదు. ఒఖమాటు పోనీ తెగించి నేను అటు తొంగిచూస్తే, అమ్మ బాబో - చూడలేను. చూడలేను, చూస్తినట్టయినా, ఆ కళ్ళల్లోని తుంటరితళుకు నన్ను స్తంభింపచేసేస్తుంది.

అ.—తమ రేదో దీర్ఘాలోచనలో ఉన్నట్టున్నారు. నా బలవంతం చొప్పునేనా, దయచేసి కూర్చోండి.

మం.—(తనలో) ఓరిబాబో, ఓరిబాబో నన్నప్పుడే ఎంత త్వరగా సమదాయిస్తోందో! నారూపం చూసేసరికి దిగ్భ్రమ చెందింది. ఇల్లా పెడముఖంగా నుంచోడంవల్ల పని జరిగింది.

అ.—రండి, స్వామీ! ఇదుగో కుర్చీ.

మం.—గృహిణీ! అపారమైన నీ మంచితనం నన్ను వశపర్చేసుగుంది–నీఅంత అందం గల కాంత, అంత మనోహరమైన నేత్రాలతో, దయదల్చి నావంటి అల్పుణ్ణి చూడడం! (అమ్మతల్లి మండోదరం చెయ్యి పట్టుగుంటుంది, అతడు మెడతిప్పి ఆవిణ్ణి చూస్తాడు.)

అ—నేనింత విధేయురాల్ని అయిపోవడం మీ కాశ్చర్యం అవుతోందిగావును.

మం—మరే, మరేనండి. నేను ఒఖరవ్వ ఆశ్చర్య పడుతూనే ఉన్నాను, అందుగురించి. (తనలో) ఛీ, దైవ సాక్షి! ఈ ఘటం కిశోరి కాదు—దీనికి మాఅమ్మవయస్సుం టుంది.

అ—పూర్వాభిప్రాయాలన్నీ మా నాన్నగారి ఆజ్ఞల్ని బట్టి మారుతూంటాయి.

మం—(తనలో) వాళ్ళనాన్నట! ఓహో! అయితే యిది కిశోరే! ఆమాటే నిజం అయితే దైవమా, హా దైవమా! తండ్రులు ఎంత అంధులో కదా!

అ—మండోదరస్వామీ!

మం—(తనలో) నిజమే! ఆ చిన్నమ్మాయి చెప్పింది యధార్థమే. దీనికి ఇంటిపెత్తనం మనిషివాలకం స్పష్టంగా ఉంది. ఇంకా నయమే. నేను దీని ధనంమాత్రమే ఏక లక్ష్యంగా పెట్టుగున్నాను. దీని రూపానికి ఆశించిఉంటే చచ్చేవాణ్ణి.

అ—మీరారు కూచోరా ఏమిటండీ? (అని, తను కూచుంటుంది.)

మం—క్షమించాలి. నేనండీ, తమరివిధేయతగురించి ఆశ్చర్యంలో పడిపోయి యింకా తేరుకోలేకుండా ఉన్నా నంటే (తనలో) దీని మొహాన్ని సొట్టలు దెయ్యపుసొట్టలు, నిజంగా!

అ—నేనింత చౌక అయిపోయానని మీరు ఆశ్చర్య పడుతూన్నందుకు నే నాశ్చర్యపడను ఉన్నమాట మొహం మీద అనేస్తాను. మీగురించి నాకు చాలా దురభిప్రాయం కలిగేటట్టు చేశారండి. పైగా మానాన్న బాధించడంకూడా మొదలెట్టాడు. అందుచేత నేను నభోమణికి కొంచెం ప్రోత్సాహం ఇవ్వడం మొదలెట్టాను. కానండీ. అయ్యో! మిమ్మల్ని మరొక మోస్తరుగా వర్ణించారండీ, నాయెదటా!

మం—చచ్చినంత ఒట్టు, మిమ్మల్ని మరొక మోస్తరుగా వర్ణించారండీ, నాదగ్గరా? ఏమడుగుతారూ!

అ—కాని, మిమ్మల్ని చూడగానే, మీ వర్చస్సు నాపాలిట బాణం అయిపోయింది. ఇల్లాంటి అనుభవం నాకు జీవితంలో కలగ లేదు.

మం—నాసంగతీ అల్లానే అయిందండి. మీ తేజస్సు నాపాలిట మృత్యువై పోయి నన్ను గుండ చేసేసింది.

అ—అయ్యో! ఎల్లా జరిగిందో చూశారా? మీకూ, నాకూ కూడా దుర్బోధ చేసేశారు. నేను తల బిరుసుగా, పెడసరంగా ఉంటానని మీ రనుకున్నారు. ఇక మిమ్మల్ని గురించి నాతో నల్లగా, మొద్దులాగ, తప్పముక్కు-తంగణాలాగ, రూపమూ, మర్యాదలూ, తీపీ, ఏమీ లేకుండా ఉండే మృగంఅని నూరిపోశారు.

మం—(తనలో) దీన్ని గురించి నాకు తెలిసిన విశేషాలు నేనుకూడా ఏకరువు పెడితే!

అ—కాని, తీరాచూస్తే, తమధోరణి ఎంతో ఉదారంగా ఉన్నదండీ! విశాలహృదయాన్ని సూచించే ఆ వర్తనమూ, హృదయంలోకి చొరగల ఆ దృష్టీ మంత్రించేసే ఆ నవ్వూ! ఏమని చెప్పను. ఎల్లా వర్ణించడం?

మం—(తనలో) ఆఁ. ఆఁ, ఏమందీ? మళ్ళీ ఒకసారి చూద్దాం దీనికేసి! (చూస్తూ) అంత పాడుగా ఉన్నట్టు కనిపించటంలే దిప్పుడు!

అ—మీరు వడ్డీభాయిలాగ ఒఖనాటికి లేరు. కుచ్చుల రంగడులా బోలె డున్నారు.

మం—(తనలో) ఔర! దీని కంఠస్వరంలో, నిశ్చయంగా ఎదో ఆనందం ఇచ్చే దినుసు ఉండితీరింది.

అ—సంఘమర్యాదల్ని అతిక్రమించి యిల్లా మిమ్మల్ని స్తోత్రం చేస్తూన్నందుకు మీరు తప్పు పట్టదని ప్రార్థిస్తున్నాను. వాళ్ళు నన్ను మోసగించా లనుకున్నా నాకు మేలేజరిగింది గనక, నాహృదయం ఉప్పొంగిపోయి, వాక్కు ప్రవహించేస్తోంది.

మం—ఓహో! ప్రియనారీ! ఇటువంటి మాటలు పలుకుతూన్న నీ పెదవులకి నేను వందనం ఆచరించాలి. (గాలిలో ముద్దు పెట్టుగుంటాడు)-(తనలో) ఈమె ధరించింది కుడా ఒక చక్కని ముఖమల్ పట్టు విశేషమే! ఇదీ ఆయన వర్ణనలో సత్యం.

అ—ఏమిటండీ, ఊరిఖేనూ! మీావైఖరిలో చాలా అన్యాప దేశం ఉందండీ! కానండీ, మీా గడ్డంమాత్రంతీయిం

చెయ్యాలండీ ! ఈ గడ్డంతో మిమ్మల్ని ముద్దెట్టుగునేకంటె ఏదుపందిని ముద్దెట్టుగోడం నయం.

మం.—(తనలో) అల్లానేలేఅమ్మాయి ! కత్తిలోటా మిటీ నాకూ నీకూనూ !—(పైకి) సరేగాని, ఒక్కపాట నాకు కటాక్షించుదూ !

అ.—అవశ్యం ! కాని కొంచెం బొంగురుపోయిందండీ, గాత్రం (అని దగ్గుతుంది)

మం.—(తనలో) ఆహా ! ఇదే వసంతవనకోకిల ! రెండు మూడు కోకిలలు ! పైకం ! (పైకి) అమ్మాయి నీ బొంగురు నాకు తెలుస్తోంది. నాప్రార్థన ఏమంటే అల్లాంటి గాత్రంతో ఇంత బాధకలిగేటట్టు...

అ.—అబ్బే ! నాకు ఏమీ బాధలేదండి, ఇదుగో వినండి.

లేతరకం పిల్లదాన్ని నాటురకం వరుడుమెచ్చి
వచ్చి మొదటిసారిచూసి ఉన్నబాధ చెబుతూంటే
చూపుచూపు కలియనీండి కన్యసిగ్గు హెచ్చుతుంది
వరుడు చెయ్యిపట్టనీండి కన్యవణికి హడలుతుంది
వరుడు పెదవిముట్టనీండి కన్య కొయ్యబారుతుంది
దడదడదడ మనేగుండె కన్యభయానికి సూచన !
కొంతకాలం జరిగితే అంతభయం మరిఉండదు.
కన్యధైర్యంతో వరుడి మొహంకేసి చూడగలదు
వరుడు చెయ్యిపట్టనీండి దగ్గరికి లాక్కోనీండి

సిగ్గుకనచం జనించదు, కులాసాగా వధూవరులు
కలిసిమెలసి తిరుగుతారు, గుడికి కలిసివెడతారు
కన్య ముసిముసినవ్వులే కన్యతృప్తికి దాఖలా.

మం—ఆహాహా! ఇది పాటా, మంత్రమా, సమ్మోహనాస్త్రమా! నీ సంగతులు వింటూంటే, అమ్మాయి, నేను మిక్కిలిగా ప్రేమించేవారొకరు స్ఫురణకి వస్తున్నారు– నీకూ ఆవిడకీ మహా దగ్గర పోలిక.

అ—ఏమింకా చెప్పరూ! మీరు అంత ప్రేమించే వారు మరొక రున్నారా?

మం—అబ్బే బ్బే! కంగారుపడకమ్మోయ్! ఇప్పుడు నా మనస్సులోకి వస్తా మా అమ్మ, మాతల్లి మాతల్లి! మరెవరూ కాదు.

అ—చాల్లేస్తురూ! తెలిసింది బండారం. నా సంభాషణతో మీరు ఆశ్చర్య చకితులైపోయారు. తల పాడైనట్టుంది. ఏమనడానికీ తోచక ఇదవుతున్నారు.

మం—నిశ్చయంగా అంతేనండి, యథార్థం. నేను సందేహిస్తూ ఆలస్యం చెయ్యడంగురించి మీరు తీర్పు చెప్పేశారు. మీమాటనితీర్పు అనాలిగాని అంతకంటె తక్కువగా అనకూడదు. నా ఆలస్యానికి కారణం ఏమిటో విన్నారా? నా సౌఖ్యం ఎప్పుడు పూర్తి అవుతుంది. జలేశంగారితో ఈవిడ దేవిరింపు ఎప్పుడు చెబుదాం, నన్ను అందునిమిత్తం ఆయనదగ్గిరికి వెళ్ళనిమ్మని ఈవిణ్ణిఎప్పుడు గట్టిగాఅడుగుదాం, అని ఆలోచిస్తున్నాను.

అ.—అదా! అయితే ఉన్నమాట మీతో అనేస్తున్నాను, మానాన్న అనుమతికోసం మీరు కూచుంటే నేను మీకు దక్క నేదక్కను.

మం.—అయ్యో కర్మమా! ఎంచేత?

అ.—తనయిష్టం నేను పాటిస్తేగాని నా మొహం చూడనని మానాన్న కోపోద్రేకంలో, ఒట్టెట్టుకున్నాడు. ఆదేసమయంలో అతడు తెచ్చిన వరుణ్ణి నేను ఒల్లను అని నేనూ గట్టి శపథం చేశాను. యుగం తిరిగినా ఆ శపథం నేను భగ్నంచెయ్యను. మీకేమైనా సత్తాఉంటే ఏమైనా పన్నడం నేర్పుంటే ఆయనికి తెలియకుండా నన్ను లేవదీసుకు పోతేనే, నేను మీదాన్నవుతాను.

మం.—(తలపంకించి, మూలుగుతాడు)

అ.—అబ్బే, మీరింకా సందేహిస్తూంటే...

మం.—(తనలో) ఇది మంచి పైత్యంలాగే కనిపిస్తుందే. నిజంగా. ఈ ప్రకారం ఆచరిస్తే, దీనిసొమ్ము నాకు దక్కుతుంది, తరవాత దీన్ని పొమ్మనచ్చు. అంటే దీనికీ వీళ్ళనాన్నకీ కూడా చెరోటోపీ వెయ్యచ్చు (పక్కకి తిరిగి అద్దం తీసి చూసుగుంటూ) అమ్మ దిక్కుమాలాడా! ఎంతటివాడవురా పోకిరీమండోదరం? ఏమి జిత్తులురా నీవి? అవునవును. నీమెదడు గట్టిది. కొంచెం విశ్రాంతి తీసుగోనీ! దైవమా! దీన్ని మనస్సులో స్వీకరిస్తాను.

అ.—ఏమండీ! ఏమి నిశ్చయించారు?

మం—లతాంగీ ! అతి సంతోషంవల్ల నాకు మాట పోయింది. నీచొరవ నేను మెచ్చుకున్నాను. నీ ప్రతిపాదన నేను మనసారా అంగీకరిస్తున్నాను. ఇందునిమిత్తం నా కృతజ్ఞత ప్రకటించడానికి నీ పల్లవహస్తంమీద ఇదే నాముద్ర (అని చెయ్యి పట్టుకుంటాడు)

అ—మీరు ఒకపని చెయ్యాలి. మనం తోటలో కొంచెం విహరించడానికని చెప్పి మానాన్నగారి అంగీకారం పుచ్చుకోండి. నేను మీకు మనస్సిచ్చినట్టుమాత్రం ఆయనతో అనకండి.

మం—ఎంతమాత్రం అనను. అంటె అంతా పాడైపోదూ ! ఎత్తువెయ్యడం విషయంలో ఎవడేనా, నా తరవాతే ! అదంతా నే ఒఖ్ఖణ్ణే చూస్తా లేస్తూ, అది నాకు వదిలెయ్ మరి ! ఈయన అధీనంలోంచి నిన్ను ఈవేళే తొలగించేస్తాను.

అ—చిత్తం. ఈ వ్యాపారం నిర్వహించడం భారం మీదే. మిమ్మల్ని చూడగానే నాకు ఒఖ్ఖసంగతి స్పష్టమౌతోంది. ఏమిటంటూరా, చిన్నచిన్న ఎత్తులికి తేలికగా లొంగిపోయేఘటం కాదుమీరు !

మం—నిజం చెప్పారండీ మీరు, దేవుడు తస్సాగొయ్యా, శుద్ధ పచ్చినిజం అనేశారు (అని RF కేసి చూస్తాడు)

అ—ఏం ? అల్లా చూస్తున్నారు ?

మం—నాకోసం ఒకాయన రావాలి. నాకు ప్రాణ స్నేహితుడు లెండి, వచ్చినా భయంలేదు. మనం నమ్మవచ్చు. (RF కి వెళ్ళి కరాళాన్ని వెంటపెట్టుగుని వస్తాడు) ఎంత సేపాయె వచ్చావు?

క—ఇదే రావడం. ఏమిటి గ్రంథం?

మం—నువ్ చెప్పు.

క—విశాల మీ యింట్లోవుంది. నభోమణి ఎక్కడా కనపడకుండా మాయమైపోయాడు.

మం—సరేలే! వాణ్ణి నేనే వెతుకుతానులే. ఒరేయ్ కరాళం, విన్నా నాచిట్టి, నేను నెగ్గాన్నా, నేను లాభం కొట్టాన్నా!

క—మీఆవిడ ఏదీ!

మం—ఓరి కొంటికోతీ, అదుగోరా, ఆ నుంచు న్నావిడ.

క—ఆవిడా! అదేమిటి కల్లోకి వచ్చేట్టు అల్లా ఉందేం?

మం—చుఫ్ (అని కరాళం నోరుమూస్తాడు)

అ—ఏమిటండీ! మీ స్నేహితు డంటున్నాడూ?

మం—ఏముందండీ! అత్యద్భుతమైన మీ ఆకర్షణ వంటిది ఎక్కడా చూడలేదుట, పట్టరాని సంతోషం వేసి పోయి ఆమాటే నాతో అంటున్నాడు. కాదుటోయ్ కరాళం!

క—లోగడ ఎక్కడా ఇలాంటి రూపం చూడలేదు, ముందు చూడగలనని అనుకోను

అ—ఎంత హృదయంగల ఆసామివయ్యా నువ్వు! సరే! మండోదరరాజా! మనం ప్రస్తుతం ఎవరిదార్ని వారు వెళ్ళిపోవడమే కర్తవ్యం, మన పన్నాగం మరవకండి.

మం—ఎంతమాట అంటిరి! నాహృదయంమీద ముద్రపడిపోతేనే. ఆపన్నాగమూ మీ దేవతామహిమ లూనూ! ఆత్మదేవతా! సెలవు. ఒక్ఖసారి నీ అనుజ్ఞతో, (అని గాలిలో ముద్దు పెట్టుకుంటాడు.)

అ—మధుర మనోహరా! మహా మండోదరా, మర్యాద మారేడూ, సెలవియ్యండి.

మం—(మోకరిస్తూ తలవంచి) ఇతడు నీ శాశ్వత భృత్యుడు? (లేచి) కరాళం ఈ వియోగ ముహూర్త సందర్భంలో నువ్వుకుడా కొన్ని ఉచితవాక్యాలు చెప్పవోయ్.

క—చెప్పవచ్చుగాని, ఈవిడపొగడ్తకి కొరుకుపడే రకంకాదు. అయినాసరే, ఈసమయానికి అనుకూలంగా ఇల్లా అంటాను.

ఈసమ్మేళన స్వభావసిద్ధం.
ఇటువంటిజోడు మరోటిచూడం.
వరుణ్ణిచూస్తే, శౌర్యంమేటి,
వధువుసరేసరి, శృంగారరాశి.

ఇవతలిమహిమలు అవతలవారూ
అవతలిసొగసులు ఇవతలివారూ
అన్యోన్యంగా కనిపెట్టుగునే
జంటల దెంతటి అదృష్టమోమరి !
ఎన్నో మాటలు చెప్పడమెందుకు ?
ఆవిడ నీకోసం పుడితే, ను
వ్వావిడకోసం పుట్టేఉన్నావ్,
ఉభయతారకం అంటేఇదేను !
మీయిద్దరిపై చల్లనిచూపులు,
మీసంతానం పుట్టుకతోటే
తమవిధులన్నీ నేర్చుగుంటారు.
కొడుకులు తండ్రిని మించినబుద్ధీ,
కూతుళ్ళమ్మని మించిన అందం,
ఉండేసంతతి కడుపునపడడం,
ఇక్కడి చొరవలు అక్కడి సొగసులు
ఒక్కటిఅవడం, ఎంతటిభాగ్యం !
మీజీవితకాలం యోవత్తూ
ఎవరికి ఎంతటి ప్రజ్ఞలుగలవో
అంతటి ధన్యత చేకూర్చాలని
భాగ్యదేవతని ప్రార్థిస్తున్నా.

(RF కి ముందు కరాళమూ వెనకాల గర్వంతో మండోదరమూ వెళ్ళగా, LM కిఅమ్మతల్లి వెడుతుంది. రెండో తెర పడుతుంది.)

[LF నించి జలేశమూ వెనకాల
పరిధానమూ వస్తారు.]

జ—ఏమిటి నువ్వనేమాట ?

ప—మణి ఎందుచేత పనికిరాడు మీకూ ?

జ—అక్షరాలా పనికిరాడు, వాడు వల్లకాదు— అని నేనే అన్నాను. వాడి దారిద్ర్యంమాట చెప్పు! అది నువ్వు తొలగించగలవా ?

ప—పెద్ద ధనికుడు కాకపోతే కాకపోవచ్చుగానండి, దరిద్రుడు కాడండి. అంత పేరుప్రతిష్ఠలుగల పురాతన వంశానికి చెందినవాడు ఈరాష్ట్రంలో మరెవడూ లేడు.

జ—మాబాగా చెప్పావులే! చాలారాష్ట్రాల్లో బహు పురాతన వంశాలకి చెందిన ముష్టివాళ్ళని నే నెరుగుదును, గాని పేరుప్రతిష్ఠలు గలవాళ్ళని ఎరగను. కుర్రాడివి నీకేం తెలుసు పోవోయ్ !

ప—మణిదగ్గిర హృద్యంగా ఉండే లక్షణాలు చాలా ఉన్నాయండి.

జ—అవున్రా. అయినాసరే వాడు దరిద్రుడురా! ఆమచ్చ ఎల్లా తీసెయ్యగలవు వాడికీ, అంటాను. అతి విలాసంగా కానితిరుగుళ్ళు తిరిగి పిత్రార్జితం అంతా టమ టమా వేయించిన రిజాలా కాడుట్రా వాడూ !

ప—నాన్నగారూ! అతనికి పిత్రార్జితం ఏమీలేదు. ఔదార్యంవల్ల అతడు రిక్తుడై పోయాడు గాని, దుబారీతనం

వల్ల కాదు. ఆ స్తంభం పోయిందిగాని. కళంకంలేని అతడి గౌరవమూ, కీర్తీ నిల్చేఉన్నాయి.

జ—ఛీ! ఫో! ఎక్కడో ఎద్దుమొద్దు స్వరూపం లాగ మాట్లాడతావేంరా! ఎంత గొప్పతనమేనా ఉండనీ, అది ఆస్తి లేనివాడైతే హాస్యాస్పదం అవుతుంది,—మాతగ వ్రాలుకోటుకి జరీకమ్మిలాగ!

ప—ఈమాటలు ఏషాహుకారు నోటంటో, ఏ వర్తకుడి నోటంటో వినవలసినవండి. మీరు అనవలసినవి కావు.

జ—అవును. అయితేం, నువ్వు షాహుకార్లనీ, వర్తకులనీ అంటున్నావేం, వాళ్ళే ఎక్కువ తెలివిగలవాళ్ళు. ఓరి వాజమ్మా, వాళ్ళూ మొదట్లో నీకుమల్లేనే పేరనీ, వంశంఅనీ, గణించినవాళ్ళే కాని క్రమేపీ బంగారం ఎంత పావనమైన పదార్థమో కనిపెట్టారు. అందుకని గుర్రాల్నీ, పశువుల్నీ కొనుక్కునేటప్పుడు తప్ప వంశవృత్తాలు తిరగేస్తూండరు. (RF కేసి చూసి) కాని ఇడుగో మండోదరం ఇల్లా వస్తున్నాడు. ఇతని వ్యాపారం కాయో పండో?

ప—ఇతని నవమన్మధరూపం ఇతడి ప్రేమ వ్యాపారంలో అద్భుతంగా పనిచేసి ఉంటుందని నమ్మకంగా చెప్పొచ్చు.

జ—(RF కేసి చూసి) ఇడుగో, మండోదరం!

ప—(RM కి వెళ్ళిపోతాడు.)

మం—(RF నించి వస్తాడు.)

జ—ఏమయ్యా నేస్తం! పిల్లని ఓదారికి తీసుగొచ్చావా?

మం—ఓ. చాలా సాధువుని చేసేశాను.

జ—ఏమిటేమిటీ? దానితిక్క తిరిగిందా?

మం—నిక్షేపంలాగ. నేననుకున్నకంటె ఎక్కువ ఆదరించింది నన్ను.

జ—ఆ చిట్టిపొట్టి అప్సరస నిన్ను చాలా మార్యాద చేసిందేం?

మం—అవునండి, ఆ చిట్టిపొట్టి అప్సరస నన్ను చాలా మర్యాదచేసింది.

జ—ఈమాట వినగానే నాసంతోషం వెల్లివిరిసి పోతోంది. సరేసరే ఆ అందం చూసేసరికి నీకు ఆశ్చర్యం వేసిపోలేదూ?

మం—ఓ. చచ్చేటంత ఆశ్చర్యంవేసింది! సరే గానండి, దయచేసి చెప్పండి, ఆపిల్లదాని వయస్సెంత?

జ—వయస్సా? ఉండు—ఎనిమిదీ పన్నెండూ—ఇరవై.

మం—(నోరు వెళ్ళబెట్టి) ఇరవైయా?

జ—ఒకనెల ఇటూఅటూ కావచ్చు.

మం—అయితే ప్రమాణంగా చెప్తానువినండి. ఆ యీడుపిల్లలందర్లోకీ దీనంత ముసిలివాలకం పెద్దమ్మ భూమ్మీద ఉండదు.

జ—ఒకవేళ నువ్వల్లా అభిప్రాయపడుతున్నావేమో కాని ఇంత అందమైన పిల్ల నీకు వెతిగినా దొరకదని నా నమ్మకం.

మం—నూటికీ కోటికీ దొరకవచ్చులెండి.

జ—కిశోరి మొహంలో సంసారంలో వాళ్ళందర్నీ పోల్చుగోవచ్చు.

మం—(తనలో) ఆ. సంసారంలో వాళ్ళందర్నీ పోల్చుగోవచ్చు, అదికూడా కొన్నాళ్ళు సంసారం చేసిందే అనికూడా పోల్చుగోవచ్చు.

జ—దానికళ్లు అచ్ఛంగా తండ్రికళ్లు.

మం—(తనలో) ఆకళ్లు వాళ్ళనాన్న కళ్ళవంటివే అని నేను వూహించుకోగలిగి ఉందును. కాని వాళ్ళమ్మగారి సులోచనాలజోడు పెట్టుగుంటే ఇప్పటికంటె బాగా దృష్టి ఆనిఉందును.

జ—అచ్ఛంగా మేనత్తముక్కు — ముత్తవతల్లి నుదురు. - వెంట్రుకవాసి తేడా లేకుండా.

మం—(తనలో) అవును. గడ్డం అచ్ఛంగా తాతగారి గడ్డం—వెంట్రుకవాసి తేడా లేకుండా,

జ—కాబట్టి నేస్తం—విధినిర్వహణం సరితూగదు గాని అందంతో-ఎల్లాంటి అందం, విన్నావా? తెచ్చిపెట్టుగున్న బాపతు కాదు, సహజంగా, శాశ్వతంగా ఉండే శోభ.

మం—అయితే కావచ్చు కానండీ, ఇప్పుడు ఆవిడకి ఇరవై యేళ్ళయితే, మరోయిరవై యేళ్ళు గడిచినా ముఖం యొక్క వయస్సుకి ఈడు సరిపోదు.

జ—ఓయి. గుడ్డి దేవుడా! మందోదరం! ఏమిటా వెటకారం ?

మం—కాదండి జలేశంగారు! మీరు త్రికరణంగా చెప్పండి. మీ అమ్మాయి అందంగా ఉంటుందనే మీఊహా?

జ—ఈ వెలుగుసాక్షి, ఈఊళ్ళో ఎవరేనా అందంగా ఉంటే అదే.

మం—క్షమించండి, ఈకళ్ళుసాక్షి. అల్లాంటి దిక్కుమాలిరూపం నే నెక్కడా చూడలేదు.

జ—అయ్యో మోసదేవతా! నీకళ్ళు బహుశ గుడ్డికళ్ళు.

మం—అబ్బెబ్బే! ఇయినో! మీదే పక్షపాతం.

జ—ఏమిటి నీఊహ ? నాకు ఇంగితజ్ఞానం లేదా, అభిరుచిలేదా ? తళుకుగలచర్మం, సుందరమైన నేత్రాలు, దంతంవంటి పల్వరస, హృద్యమైన వికాసం, కోమలమైన రూపం, ఇవన్నీ కాక దివ్యమైన కంఠస్వరం, అపారమైన విలాసం ఇవన్నీ ఆకర్షణలు కాకపోతే మరి అందం అంటే ఏమిటో నాకు తెలియదు.

మం—అయ్యో కర్మమా! తండ్రి అల్లాంటి కళ్ళతో చూస్తాడుగావును కూతుర్ని! నేను బతికున్నంత ఒట్టు,

ఆవిడ మీరు చెప్పే ధోరణికి కేవలం చుక్కఎదురుగా ఉంది. ఆవిడ జబిలిపోగు పట్టుగస్తులు ధరిస్తుందన్నారు మీరు. తీరా ఏం ధరించిందంటే నాన్‌కీను ముతకగుడ్డ – అని ప్రమాణం చేస్తాను. ఆవిడ కళ్ళు పశేసాల్లో మెల్లలక్షణం–ఒక అల్ప విశేషం–గుడ్డిలో మెల్ల! ఆవిడపళ్ళు–అన్నీ దంతపుసరుకే అయి ఉంటుందిగాని తెల్లటిపన్ను ఒకటిఉంటే దాని యిరుగు పొరుగున, నల్లదంతపుపన్ను మరొకటిఉంటూ, తెలుపూ నలుపూ నలుపూ తెలుపూ కలగలుపుగా అచ్చంగా హార్మనీ మెట్లులాగ ఉన్నాయి. ఇక ఆవిడపాట! ఆవిడ దివ్యకంఠస్వరం–మహాప్రభో అది ఎంతకీచో ఎంత పెళుసో దేవుడికే తెలియాలి, గాని ప్రపంచానికి ఎల్లాఉందంటే చంటిపిల్లలు చిల్లుబూరా ఊదినట్టుంది.

జ—ఓయి, మడగుజ్జుపోఖిరీ! నాయింటికొచ్చి నన్ను యాగీ చేస్తావా పో, లేచిపో, నాకొంపలోంచి.

ప—(RF నించి గబగబానచ్చి) ఏమిటి నాన్న గారూ, ఏమిటిసంగతి?

జ—చూడు. ఈ పసుప్రాయుడి పొగరు! నీచెల్లెలు కురూపిట.

ప—అయితే ఈయునికి కళ్ళైనా పోయిఉంటాలి, తలేనా తిరిగిఉండాలి.

మం—(తనలో) ఓహో! వీళ్ళంతా లాలోచీగావును. ఓరి దేవుడా! నేను చాలాహట్టుకి వెళ్ళినట్టున్నానే అనవసరంగా!

ప—తప్పకుండా ఇదేదో పొరపాటండీ, నాన్నా అమ్మాయిని కాక మరొకర్ని ఈయన చూసిఉండాలి.

జ—ఓరి, నీదేవుడు మాసిపోను, నువ్వు వాడికంటె అభాజనుడవులా ఉన్నావేమిరా ! ఏంపొరపాటు వచ్చిఉంటుందీ ? కిశోరిని గదిలో పెట్టి నేను తాళం వెయ్యలేదూ ! ఆతాళంచెవి ఇదిగో నాజేబులో ఉందే ! దాసీది ఆ గది దగ్గిరికి ఆయన్ని తీసికెళ్ళిందిగదా ! ఇంకా పొరపాటేమిటి నీమోహం ? కాదు కాదు. ఈ దిక్కుమాలాడు నన్ను తూలనాడాలని సంకల్పించాడు మనింటి కొచ్చినవాడుగదా అని ఊరుకున్నానుగాని, ముసలాణ్ణి అయితేమాత్రం నాకేం లోటు—వీణ్ణి కత్తిడితే నరికిపోగులెట్టి వీడికి తగినశాస్తి చేసిఉండేవాణ్ణి.

మం—(తనలో) ఈ చిక్కులోంచి వీలైనంత లాఘవంగా దాటుకోవాలి. దాని అందం ఎల్లా అహోరించినా, దానిఆస్తి అందం అంతకంటె తక్కువరకం కాదుగా ? ఇల్లా మారి చూస్తాను. (పైకి) స్వామీ ! నామాటనమ్మండి మీకు కష్టం కలగాలని నేను అనుకోలేదు. ఆపిల్లని నేను ప్రేమిస్తున్నాను. మనస్నేహం మన్నిస్తున్నాను. ఆవిడ నాకు దక్కేటట్టు చేసుగుని ఆపిణ్ణి మంచికో చెడ్డకో పెళ్ళాడతాననే ఇప్పుడుకుడా నా విన్నపం – నేను వేళాకోళం చెయ్యడంలేదని ప్రమాణంచేస్తాను.

జ—ఛీ పో ! నాకోపం ఇప్పటికే చాలా చెలరేగి ఉంది. దాన్ని ఇంకా రేపకు.

మం—ఏమయ్యా! వీరిని కొంచెం కట్టెయ్యండి. మీాకు మొక్కుతాను. ఈయన కోపం తాడి ప్రమాణానికి పెరిగింది. పురుష వృషభా! మీారు మరీ ఉద్రేకంలో ఉన్నారు. నేను బయటికి పారిపోవాలి.

జ—ఓరి దగుల్బాజీ తాగుబోతా! వెంటనే ఇక్కణ్ణించి లేచిపోరా!

మం—జలేశ మహాశయ్యా! తాళండి, తాళండి. ఇక సరసాలు అల్లాఉంచి, త్రికరణంగా వ్యవహరించుదాం!

జ—ఎట్లా?

మం—(నవ్వుతూ) ఇందాకణ్ణించీ నేను మీా అమ్మాయిని దూషించడం యావత్తూ నిజం అని మీారనుకున్నారో లేదో చెప్పండి. చెప్పకపోతే నన్ను చంపుగున్నట్టే!

జ—నిజమనే నీఊహ! కాదూ?

మం—(నవ్వుతూ) అబ్బెబ్బె! ఓరి దేవుడా! అదంతా ఉత్త ఛలోక్తికోసంఅండీ! మీాకేమాత్రం కోపం వస్తుందో చూడాలని అల్లా అన్నాను.

జ—ఓరి నీసిగ్గొయ్యా, అంతేటోయ్! నువ్వింత తమాషారాయుడవని నేను అనుకోలేదు. హారి (అని నవ్వుకుని) మోసదేవతసాక్షి! నాకు చాలాకోపం తెప్పించావుస్మీ. సరే సరే. కిశోరి అందంగా ఉంటుందని అంటావా?

మం—నిమ్మణంగా అంటారేం, ఇంకా! రంభా తిలోత్తమలు అమ్మాయి దిగదుడుపుకేనా పనికిరారు.

జ—ఔర, ఔర! ఎంత చమత్కారపు భడవ్వీ! ఏదీ చెయ్యిల్లాతే. పాడు దేవుడా! మనిద్దరిస్నేహం ఇందాకా రాం, రాం అయిపోయిం దనుకున్నాను.

మం—(తనలో) నేనూ అనుకున్నాను. ఇది పెద్ద గొడవలోకి దిగుతుందని. కాని మాంజాతి జిత్తులు ఇంకా ఉన్నాయని తేలింది.

జ—అబ్బ! నాకు సాధారణంగా కోపమేరాదు. కాని ఈ కోపోద్రేకంవల్ల నోరు ఆర్చుకుపోయింది. ముందుకొంచెం ద్రావకం పుచ్చుకుందాం. పిల్ల ఆరోగ్యంయొక్క చలవగురించి మరికొంచెం పుచ్చుకుందాం. ఓసి వెర్రి కిశోరీ! (నవ్వుతూ) అది కురూపిట! మహా మంచి వేళాకోళమే.

మం—అయినా, చాలా సార్థకమైన వేళాకోళమండీ, ఎంత చెప్పినా! పదండి!

జ—రండి.

(అని LM కి ముందు జలేశం నడవగా వెనకాలే మంహోదరం నడిచిపోతాడు తెర)



## రంగం-3

[మండోదరం ఇంట్లో ఒకగది. ఒక సోఫామీద కిశోరి
కూచుని ఉంటుంది. ఆలోచిస్తుంది. లేచి
ఇటూఅటూ తిరుగుతుంది.]

కి—తండ్రిని చెడనాడుకున్న నాలాంటి పిల్ల నే నున్నంత వింతపరిస్థితుల్లో ఉండడం ఎక్కడేనా విన్నామా? నాభర్త అవుతాడనుకున్నవాణ్ణే నేను పంపించాను, నామనో హరుణ్ణి తీసుగురావడానికి నాతండ్రి నాకోసం ఎన్నినవా డెళ్ళి నేను ఎన్నుకున్నవాణ్ణి వెంటబెట్టుకు రాబోతున్నాడు. కాని ఇంత ఆశతో ఉన్నప్పుడు కాలవిలంబనం ఉత్సాహాన్ని ఆర్పేస్తుంది. ఓ కాలదేవతా! నీకు రెక్కలున్నట్టు మొదట్లో కవిత్వం చెప్పినవాడిపేరు పైకి తీసుగురా. అయ్యో! ప్రియురాల్నిగురించి క్షణకాలమైనా ఎడబాటు లేనివాడై ఉంటాడు, అతడు! ఎంచేతంటే, ఒక రోజైనా సరే ప్రియురాల్ని ఎడబాయవలసొచ్చి వియోగబాధ అనుభ వంలోకి వచ్చినవాడే అయుంటే, ఎవడేనా నీకు రెక్క లున్నట్టు వర్ణించగలడా, కాళ్ళే లేనట్టు భావించవచ్చుగాని! (RF నించి కరాళం వస్తాడు) ఏమి సోదరా! మణి కనిపిం చాడా?

క—నేను ఎంత వెతికిగీ అతణ్ణి పట్టుగోలేకపోయాను, సోదరీ! కాని నిస్సందేహంగా మా స్నేహితుడు మండో దరం అతణ్ణి ఇప్పుడే వెంట తీసుగొస్తాడని నాఊహ.

కి—అయ్యో, సిగ్గు సిగ్గు. మీరు యత్నం చేసింది యేదీ? మీరు రక్షిస్తారని మిమ్మల్ని నమ్ముకున్న స్త్రీకి ఇంతేకదా మీరు కనపరిచే మర్యాద!

క—నమ్మవమ్మా సోదరీ! నేనూ ఆ విషయం అశ్రద్ధగా లేను.

కి—ప్రేమ వహించి తన ప్రేమమూర్తిని చూడడానికి కనిపెట్టుగుని ఉండే స్త్రీకి క్షణికాలస్యంకూడా ఎంత దుర్భరమో మీ యిద్దరిలో ఏ ఒకరికేనా తెలిసిఉంటే, మీరు ఈ విషయాన్ని ఇల్లా తేలికగా చూసిఉండరు!

క—కటకటా! సోదరీ! నాకు పూర్తిగా తెలుసును.

కి—అయితే సోదరా! నువ్వెప్పుడైనా ప్రేమాశ్రమంలో ఉండినవాడవా?

క—ఆ, కాని జీవితంలో ఇంక ఆ ఆశ్రమం నాకు వద్దు.

కి—నీ ప్రియ అంత కఠినురాలా?

క—ఎల్లకాలమూ కఠినంగా ఉంటే నేనింకా సుఖంగా ఉండేవాణ్ణి.

నా ప్రియ అసలే నవ్వకపోతే ఏ బాధా నాకు తెలియకపోను
నువ్వే ఆలోచించి చెప్పుమరి ఆవిడ ద్రోహం, కాఠిన్యంవినూ.
బెంగపడకు, నన్ను పొందగల ఆశ పెంచుగోఅని నాతో
చెబుతూ
ఆరేమంటని పూర్తిగా ఆరనియ్యక మళ్ళీ ఊదడమెందుకు?
తను ఆశనాటి తనే తుంచనా గుండె లేని మొండినిరసనతో!

గాలికిపోయే ఓడఉంటుంది దానికి భంగం వస్తుందనుకో బద్దలైన ఆ ఓడమీదించొకడు దూకేసి చావబోతాడనుకో గట్టుకి వచ్చాం దూకకు చావకు అనే కేక వాడికి వినిపిస్తే నిరాశ చెందక సంతోషంతో వాడదినింటాడు. వింటేంగనక ఒడ్డుకి చేరకముందే పగిలిన ఓడభాగాలు కిందికి పోతాయ్. వాడూ కిందికిపోతాడుగదా! వాడికిపట్టే దుస్థితీ, వాడు పొందే బాధా తలపోసిచూడు వాడిగతికంటె నాగతేం

నయం?

కి—(RF కి చూసి) అమ్మా! ఇదుగో మీ స్నేహితుడు, మణితో కలిసివస్తున్నాడు! నేను లోపలికి వెడతాను, ఆయనకి కొంచెం ఆశ్చర్యం కలగడానికి (అని LM కి వెళ్ళిపోతుంది.)

[RF నించి ముందు మండోదరమూ వెనకాల నభోమణీ వస్తారు]

న—నిజమేనండీ, నేస్తం! మీరెదో పొరబడ్డారు. విశాల నన్ను ప్రేమించడం ఏమిటి, నన్ను తీసుకురావడానికి మిమ్మల్ని పంపించడం ఏమిటి! అసంభవం. ఎవడేనా వింటే నవ్విపోతాడు.

మం—ఉండవయ్యా! తినబోతూ రుచి అడగడమెందుకుగనకా! క్షణంఆగు తెలుస్తుంది. కరాళం! ఆ అమ్మాయి ఏదీ?

క—(LM కేసి చెయ్యి చూపిస్తాడు)

మం——ఆవైపు గదిలో ఉందా? అల్లానా?

న——ఒకవేళ నిజంగా ఆవిడ ఇక్కడ ఉన్నా ఆవిడ ఉద్దేశం ఒకటై ఉంటుంది. తనకి చిరకాల ప్రియుడూ, నాకు హృదయస్నేహితుడూ అయిన ఒకాయిన దగ్గిరికి తనని తీసి గెళ్ళమని నన్ను కోరాలని అయిఉంటుంది.

మం——ష్! అది కాదయ్యా అంటే, అల్లా మాటాడతావేం? కేవలం నిన్నే ఈవిడ కోరుతూంటూ, నిన్నుతప్ప మరెవర్నీ కాదు. ఓహోహో! నీకోసం ప్రాణంకుడా అర్పించే చక్కనిచుక్కని నువ్వు స్వీకరించడానికి మహా బలే గందరగోళం చేస్తున్నావే?

న——నాకీ అమ్మాయిమీద మనస్సు లేదండీ!

మం——అయితే కిశోరిమీద ఉందిగావును. ఏం? అయితే చెప్తాసేను నభోమణీ! ఆ విషయంలో ఆశా లేశం కూడా లేదు.–అందుచేత ఇక్కడ కొంతలాభం నీకు దానంతట అదే కొట్టుగొచ్చింది, మాటగట్టుకో.

న——నేను నీకు స్నేహితుణ్ణి. నన్ను ఆదేశం చేస్తున్నావుగదా. నీ అంతరాత్మకి ఎల్లా సమాధానం చెప్పగలుగుతున్నావు?

మం——పోవోయ్, అంతరాత్మా నువ్వూనూ! అంతరాత్మకీ, రాజకీయానికీ ఎట్లా సంబంధం లేదో, అంతరాత్మకీ ప్రేమవ్యాపారానికీకుడా అట్లాగే ఏమీ సంబంధంలేదు. ప్రేమ వ్యవహారంలోకుడా యథాశక్తి పోకిరీతనం చూపించ

లేనివాడు నిజాయితీమనిషి కానేకాడు, ఆమాటకొస్తే !— అందుకని. ఆట్టే సాక్కు, లోపలి కెళ్ళి ఆ అమ్మాయితో మాట్లాడి, రా, అధమం.

న—అల్లా అన్నారు, నచ్చింది. అందుకు నా అభ్యంతరం లేదు.

మం—(నభోమణి చెయ్యిపట్టుగుని LM దగ్గరికి తీసి గెళ్ళి) అదుగో చూడు - అక్కడుంది, ఆ కిటికీదగ్గిర ! లోపలికి వెళ్ళవోయ్, ఊఁ (అని నభోమణిని లోపలికిగెంటి, తలుపు గడియ వెయ్యడం అభినయిస్తాడు.) అమ్మయ్య ! కరాళం! ఇకనాటీపూచీ, ఈపిల్లని పీడి నెత్తికి రుద్దేశానన్న మాటే ! ఉండు ! వీళ్ళ వ్యవహారం గమనిస్తాను కొంచెం. (అని చూసి) ఓరి దేవుడా ! వీడు నిర్ఘాంతపోయినట్టు నిలబడి పోయాడు. (మళ్ళీచూసి) చూడు చూడు కరాళం. మన వాడు కొంతఃరకు దారికొస్తున్నాడు. అవును అవునూ ! వీడు చిటిగిలో మరచిపోతాడు 'అంతరాత్మ' విషయం.

క—(చూసి) చూడు చూడు. వాళ్ళిద్దరూ నవ్వుకుంటున్నారు.

మం—(చూసి) మరే! అవు నవును. ఇందాకా వీడు తన స్నేహితు డెవడో ఉన్నా డన్నాడే, వాడినోట్లో ఇక కరక్కాయేగదా అని వీళ్ళనవ్వు. వీళ్ళతస్సాదియ్యా, వీళ్ళు వాణ్ణి పట్టి కొట్టించేశారు.

క—చూడాలి, చూడాలి. ఈయన ఆవిడచెయ్యి ముద్దాడుతున్నాడు.

మం—శభాష్, అవును, ఒట్టు, వీడు సరేఅని ఒప్పు గున్నాడు. బలే బలే! వీడు పట్టుబడిపోయాడు. ఉరిలో చిక్కుగున్నాడు. ఓయి నా ప్రియకరాళం! మనంచేకూర్చిన సంఘటనోయ్ ఇదీ! (అద్దంతీసి చూస్తూ) ఓ, ఓ, ఇదంతా నీ చిన్నారి జిత్తుల మెదడేనోయ్, మండోదర మహాను భావా! కరాళం! నేను అపర మ్యాకివెల్లిని, అపర చాణ క్యుణ్ణి.

క—(RF కేసి చూస్తూ) మీకోసం ఎవరో కేకవేసి కనుక్కుంటున్నారు, ఎవరో చూసి వస్తాను. (అని RF కి వెళ్ళిపోతాడు,)

[LM నించి నభోమణీ, కిశోరీ వస్తారు]

న—సరేనయ్యా, ప్రియస్నేహితుడా! జలేశం యింట్లో నీ విజయంయొక్క అమోఘత్వం ఈ యువతి నాకు పూర్తిగా నచ్చచెప్పేసింది గనక నా సంకల్పంకూడా అటు వైపు వెళ్ళనీకుండా ఉపసంహారం చేసేసుగున్నాను.

మం—అల్లా అన్నావు, నచ్చింది, ఇంత తెలివిగా ఈ మధ్య ఎన్నడూ నువ్వు వ్యవహరించలేదు. ఇక, నీస్నేహితు డెవడో అన్నావేం, వాడికి ద్రోహం జరుగుతుందంటావేమో! జీలకర్ర పోదూ! ప్రేమవిషయంలో పన్నాగాలన్నీ న్యాయం లోనే జమ! కాదూ! అమ్మాయీ!

కి—నిశ్చయంగా అంతేనండి. మీరే అల్లాంటి అభి ప్రాయం కలిగి ఉండడం నాకు మరీ సంతోషం వేసి పోతోంది.

మం—ఓయి దేవుడా! నిజమే, ఆవిడా! ఎవరేనా వచ్చి నామీద ఎత్తువేసి నెగ్గమను చూస్తాను! అప్పుడూ నా తఢాకా! కాని, ఇల్లారండి. నేనే ఒకరిచెయ్యి ఒకరి చేతులో పెడితేగాని, నాకు తోచదు (అని కిశోరి చెయ్యి పట్టుగుని నభోమణిచేతులో ఉంచుతాడు) మణీ! నువ్వు అదృష్టవంతుడవోయ్, భడవా! మీ రిద్దరూ సుఖంగా పెళ్ళిచేసుగోవాలని నా ఆత్మ అట్టడుగునించి కోరుతున్నాను.

కి—మీరే అల్లా కోరితే, దీన్ని ఆటంకపరిచేవారు మరెవరూ ఉండజాలరని నేను ఋాఢిగా చెప్పగలను.

మం—నభోమణీ! ఇంతటినించి మనిద్దరికి వైరం లేదు. మనం మంచి స్నేహితులంగా ఉందామా?

న—హృదయపూర్వకంగా ఉందాం, మండోదరం!

మం—ప్రేమలో వైరినిగురించి, ఇంత శ్రమపడడం గాని, ఇంత ఉదారంగా వ్యవహరించడంగాని ప్రతీ మానవుడికీ తరంకాదుస్మీ అని నేను మీతో చెప్పవలిసొచ్చినందుకు మీరు ఏమీం అనుకోవద్దు.

న—అనుకోడంకుడానా! ఈ దేశం మొత్తంలో, మీరుతప్ప ఇల్లా వ్యవహరించగలవాడు ఉండగలడని నమ్మడానికికుడా వీలులేదు.

మం—సరేగాని, నువ్వు ఆ యువతిని గురించిన సన్నాహాలు మానేసినట్టేనా?

న—ఆ, ముమ్మాటికీ మానేశాను.

మం—అక్కడింకా నీ కేమాత్రమో కొంత ఆశ పడిపిస్తుందేమో అని నా సందేహం.

న—అబ్బెబ్బే! చీమంతేనా నాకు అటువైపు ఆశ లేదండి. సత్యప్రమాణికంగా.

మం—ఆశ—అంటే ఆపిల్లమీద కాదు, ఆపిల్ల ఆస్తి మీద!

న—ఆపిల్లకిఉన్న యావదాస్తినీ, ఆపిల్లనీ హృదయపూర్వకంగా తమరికి వదిలేస్తున్నాను. మహారాజులా వెళ్ళి స్వీకరించండి.

మం—కాని అందంవిషయంలో నీ బేర మేలాభసాటి, ఓ యిరవై రెట్లు, అని అల్లాడుంచు. ఇప్పుడు పరమరహస్యం ఒకటి చెప్తాను ఆలకించండి—ఈ సాయంత్రమే నేను కిశోరిని లేవదీసుకువస్తాను.

కి—అయ్యో! అయ్యో! నిజమేనాండీ?

మం—నిజమే. ఆ అమ్మాయి శపథం పట్టింది, తండ్రి తెచ్చినవాణ్ణి తను అంగీకరించను—అని. అందుకని నేనూ ఆ అమ్మాయీ సాయంత్రపువేళ తోటలో విహారించగలందుకు ఆయన్ని ఒప్పించాను. ఆ సమయంలో ఆయన కంట్లో మొంతిచల్లి ఉడాయించేస్తాం.

కి—పాపం! ఆ జటీశంగారికి ఏమీ తెలియనియ్యకుండా!

మం—ఓరి దయ్యం! వాడికి ఏమీ తెలియనియ్యం. ఇందులో ఉండేమజాకా అదే. ఈఎత్తుతో అతణ్ణి తోకరా

తినిపించలేమూ ? ఆపిల్ల ఆ స్త్రిమీద హక్కు నాకు సంక్రమిస్తుంది, నేను దానికి గవ్వైనా ఇవ్వక్ఖర్లేదు. (అని నవ్వుతాడు.) నాబొడ్డుపొక్కా, నేనెంత, జిత్తులమారినక్కనో! కాదూ! పొట్టివాణ్ణైనా, పుట్టిను పుంభాకోర్ని...

న—(నవ్వుతూ). పుట్టిదేమిటే, ఇంకా ఎక్కువే, అడ్డమూ !

మం—పుంభాకోర్ని మాత్రమే అనుకుంటున్నావు, కాని కుశాగ్రబుద్ధిని కూడానూ! కాదూ? కాకపోవడమేమిటే, యమ-కుశాగ్రబుద్ధిని.

న—అవును. నువ్వు కుశాగ్రబుద్ధివి-చాలా, యమ, యమాంతక-

మం—యథార్థం యావత్తూ బయటపడ్డప్పుడు జలేశంగారి ఇంటివగ్గిర, ఎంతనవ్వు వస్తుందో మాకందరికీ ! ఏమంటారు ?

కి—సందేహ మేమిటండీ ? నేను పూచీకూడా పడతాను కావలిస్తే. సత్యం వెల్లడికాగానే మాకందరికీ కూడా మహాబలేగా నవ్వొస్తుంది. అసలు నాకు ఇప్పుడే వస్తోంది. (అని నవ్వుతుంది.)

[R F నించి కరాళం వస్తాడు]

క—మండోదరం ! నువ్వు రమ్మన్నావుట, నట్టువాళ్ళు వచ్చారు, నీకు నాట్యం నేర్పడానికి కిశోరి గారవార్థం నువ్వు వాళ్ళదగ్గిర చురుకడుగు నేర్చుగుంటానన్నావుట.

మం—ఓరి వాళ్ళా! ఇప్పుడు నాకు అవసరంలేదు. కాని ఉండమను. వాళ్ళకి అనుకున్న సొమ్ము ఇచ్చెయ్యాలిగా. డబ్బు దండగెందుకూ, పోనీ వింతడుగు నేరుస్తాను. మరి, మీరు నన్ను క్షమిస్తారా?

కి—సంతోషపూర్వంగా!

మం—ఇదుగో నా స్నేహితుడు. మీకు ఏంకావలిస్తే అది చేసిపెడతాడు, మీరు ఆజ్ఞ ఇవ్వడంతడువు. యువతీ-మిక్కిలి విధేయుణ్ణి. మణీ! నీకు సకలసౌఖ్యాలూ కలగాలని దీవిస్తున్నాను. (తనలో) ఇల్లా మీాటిపారేశాను, ఈ మట్టి తలకాయ్‌గాణ్ణి! చేతులో కీలుబొమ్మగా చేసేశానువీణ్ణి—ఈ మణిగాడిమీాద నేనిప్పుడు వేసినఎత్తు నాఎత్తుల్లోకల్లా మణిపూస (అని RF కి వెడతాడు.)

కి—శరాళంగారూ! మీరు మళ్ళీ నాకూడాఉండి. నన్ను గోమాత మఠానికి చేర్చాలి.

న—అదేమిటె, నువ్వక్కడి కెందుకూ?

కి—నా కారణాలు నాకున్నాయి. మనం కలిసి కనపడకూడదు. అక్కణ్ణించి నేను మానాన్నకి రాస్తాను. బహుశా, తను నన్ను ఏస్థితికి తెచ్చాడో గ్రహించుకుంటే, కొన్ని మెట్లు దిగవచ్చు.

న—ఆయన విషయంలో నాకు ఆశలేదు. ప్రేయసీ! ఈ చేతులుగదా నీకు పవిత్రసదనం!

కి—ఆట్టేసేపు అఖ్ఖర్లేదు, కొద్దిగా ఓపికపట్టు, మణీ! అక్కణ్ణించి మానాన్న నన్ను ఇవతలికి తియ్యలేడు. కాని సాయంత్రంలోపల నువ్వు నా కక్కడ కనిపించు, సంగతేముటో విశదంచేస్తాను.

న—అల్లాగే. శిరసావహిస్తున్నాను.

కి—రావయ్యా! నేస్తం. మణి! ఈ కరాళంకూడా ప్రేమబాధ పడ్డవాడేసుమా!

న—అయితే, తన పూచీయొక్క విలువ తెలిసినవాడే.

క—నమ్మినచోట నేను మరొకమో స్తరు కానని మీకే తెలుస్తుంది.

కి—రండి, కరాళంగారూ! (అని RM కి నడువగా, వెనకాల కరాళం వెడతాడు. వాళ్ళ గమనం చూస్తూ నభోమణి నిలబడతాడు. తెరపడుతుంది.)



## రంగం-4

[జలేశం యింట్లో ఒకగది. జలేశం తోచనట్టు ఇటూ అటూ తచ్చాడుతూ ఉంటాడు.]

జ—పరమాశ్చర్యంగా ఉందే! జన్మలో చూడ లేదు ఇంత వైపరీత్యం. కిశోరి వెళ్ళిపోవడం ఏమిటి మండోదరంతో? తనపెళ్ళి ఎవడితోటని నేను నిశ్చయించానో వాడితో రహస్యంగా ఎగడిపోనా! ముగుడితో లేచిపోయిం దన్నట్టు వచ్చింది.—అబ్బే, ఇది సంభవనీయమూ అని! తీరాచూస్తే తోటగుమ్మం భార్లాతీసి ఉంది. ఇది మహాదురవ గాహంగా తయారైందే! పాడుదైవమా! ఇందులో తప్ప కుండా ఏదో రాకుసం ఉంది. బుర్రకి అందడం లేదు!

తం—(RF నించి వచ్చి) అయ్యగారూ! ఉత్తర మండి మండోదరంగారి దగ్గర్నించి. (అసి, ఉత్తరంఇచ్చి వెళ్ళిపోతాడు).

జ—ఓహోహో! అల్లాచెప్పూ! ఇందులో ఉం టాయిగావును, వయినాలు. ఔర! ఇసకపుట్ల మండోదరం! ఏమంటాడో చూద్దాం. (ఉత్తరం విప్పి) "ఇష్ట తమ మహా శయా! మీ అమ్మాయితో కలిసి నేను పరారీ అయిపోవ డంవల్ల మీకు అత్యాశ్చరం కలిగిఉండడంలో ఏమీ ఆశ్చ ర్యంలేదు."—అవును. నిజంగానే ఆశ్చర్యపడితే పడతాను.

(ఉత్తరంలో) "ప్రథమ సమావేశంలోనే ఆ యువతి హృదయం నేను హరించడం అనే అదృష్టం అనుభవించాను."—అవునోయ్ భడవా! అనుభవించావు అంత అదృష్టం. (ఉత్తరంలో) "కాని, ఈపిల్ల మీరు తెచ్చినవాణ్ణి భర్తగా స్వీకరించకూడదు—అని కర్మవశంచేత లోగడ శపథం చేసుకుని ఉండడంచేత ఈవిడముచ్చట తీర్చవలసిన అవసరం నాకు కలిగింది."—అల్లా చెప్పల్లా చెప్పూ! అదా గ్రంథం! (ఉత్తరంలో) "మేమిద్దరం వచ్చి త్వరలోనే మీ పాదాల మీద వాల్తాము. ఆ సమయానికి తమ ఆశీర్వచనం సిద్ధం చేసిఉంచితే ఆ క్షణంనించి తమ అల్లుడై ధన్యుడు కాదలిచిన—విధేయుడు—మంథోదరం."—పిల్లకి ముచ్చటా, ఏం, దీనికి దెయ్యంగాని ఏమన్నా పట్టిందా ఏమిటి? వాడితో పెళ్ళిఅంటే ఉదయాన్ని ఉరెట్టుగుంటానంది. సాయంత్రం పడకుండానే వాడితో ఉడాయించేసింది. పోనీ, పోనీ నా యిష్టం నెరవేరింది. ఉద్దేశాలు ఎల్లాగట ఉండనీ—మరి, ఆ వడ్డీదాసు, కడం గ్రంథం జరపను పొమ్మని అనేరకం కాడు.

తం—(RF నించి వచ్చి) అయ్యగారు! ఎవడో మనిషివచ్చి, కిశోరి అమ్మాయిగారు ఈ ఉత్తరం ఇక్కడ ఇమ్మన్నారని ఇచ్చాడండి. (అని మరోఉత్తరం ఇచ్చి వెడతాడు.)

జ—ఏదీ, ఏదీ! (అని ఉత్తరం తీసుకుని చూసి) అవునవును. అమ్మాయి దస్తూరీయే. ఓయి దేవుడా!

ఇద్దరూ చెరో ఉత్తరమూ రాయవలిసిన అవసరం ఏ మొచ్చిందో! సరే చూద్దాం! (ఉత్తరం విప్పి) "నాయిష్ట తములైన నాన్నగారికి–నేను చేసిన సాహసంగురించి తమ క్షమాపణ ఎట్లా కోరుకోవాలో తెలియడం లేదు. ఉన్న ఉద్దేశం ఎట్లా ఒప్పేసుగోవాలో బోధపడటంలేదు"—ఆఁ, పోదూ! ఆ ఉద్దేశంసంగతి మండోదరం నాకు రాశాడుగా! (తనలో) వీళ్ళిద్దరూ ఉత్తరాలు రాసేటప్పుడు ఒకేసలంలో లేరా ఏమిటి చెప్మా! (ఉత్తరంలో) "నిరాదరణ సహించ లేని రోషంగలదాన్ని అయి ఉండడం ఎంతనిజమో, నేను దయవల్ల కరిగిపోయే హృదయం గలదాన్ని అవడంకూడా అంతే నిజం."—ఓహోహో! మెల్లి మెల్లిగా గ్రంథంఅంతా బయటపడుతోంది. నభోమణి తనయెడల చూపించిన నిరాదరణ సహించలేక బాగా బుద్ధి తెచ్చుకోగా మండో దరంయొక్క దయ తనకి బోధపడిందన్నమాట. అవునవును. అంతా అరటిపండు ఒలిచినట్టుందిమరి! (ఉత్తరంలో) "ఈయన నన్ను ఆరాధించే వ్యక్తిఅయినా నేనింకా ఈయ నను పెళ్ళిచేసుగోలేదు."—అవునవును మండోదరానికి పిల్లమీద కొండంతప్రేమ. (ఉత్తరంలో)—"మీ సమా ధానంకోసం ఎంతో ఆదుర్దాతో నిరీక్షిస్తాను. మీ ప్రత్యు త్తరంలో మీ అంగీకారం పొందగలిగేటంత అదృష్టమే నేను పెట్టిపుడితే, మేరఉండని నా సౌఖ్యానికి కారణ భూతులు కాగల మీ ఎల్లకాల ప్రియకుమారి—కిశోరి."–

నా అంగీకారమా ? తప్పకుండా ఇచ్చేస్తాను. దైవమా ! ఇంతగా నేనెప్పుడూ ఆనందపడలేదు. నా మనోనిశ్చయం నెరవేర్చుకోగలిగాను, నెరవేర్చితీరుతాననీ నాకు తెలుసు. ఎవళ్ళకేనా మాంచి మొండిపట్టు ఉండాలి. దానిలాంటిది మరోటిలేదు ! ఒరేయ్, ఎవర్రా ?

తం—(RF నించి వచ్చి) అయ్యా !

జ—ఈ ఉత్తరం తెచ్చినవాణ్ణి ఉండమను. సిరా బుడ్డీ, కలం, కాగితం ఇచ్చివెళ్ళు.

తం—(RF కి పరిగెట్టికెళ్ళి వచ్చి LM కి వెళ్ళి సిరా బుడ్డీ, కలం, కాగితం తెచ్చిపెట్టి మళ్ళీ RF కి పోతాడు.)

జ—కిశోర్ మనస్సు కుదటపడేదాకా నేను ఆగ లేకుండా ఉన్నాను. (అని రాయడం అభినయించి, కాగితం మడిచి) ఏంరా ?

తం—(RF నించి వచ్చి) అయ్యా !

జ—ఇది ఆ మనిషి వాడికిచ్చి కిశోర్‌కి అందజెయ్యమను.

తం—చిత్తం ! (అని RF కి వెడతాడు.)

జ—అమ్మ ! ఇక ఘనంగా విందు ఏర్పాటుచేస్తాను ఈరాత్రి ! అపరూపమైన ద్రావకాలు ! మనోహరమైన గానం ! గేట్లన్నీ తెరిచేఉంచడం ! వచ్చినవాళ్ళంతా అతిథులే ! రాత్రి అంటే ఇదేరాత్రి అనిపిస్తాను. ముసిలి ఘటంకూడా ఎంత హుషారుగా ఉండగలడో చూపిస్తాను.

నాయవ్వనంరోజు లెటువంటిరోజులూ !
గ్రహం వక్రించినా నవ్విపారేశాను
పొద్ద స్తమానమూ ప్రేమసంభాషణే
రాత్రిళ్ళు మధుసేవ సౌఖ్యపరమావధే !
అప్పుడేమీనాకు జంఝూటనలు లేవు,
వాటిబెదరింపులకి నేను భయపడలేదు.
వాటి చెడుగులు సగం యౌవనం కాసింది,
ఆ మిగతసగాన్ని మధువు మోసేసింది.
సత్యముందంటారు సూతికట్టడుగుగా
ఎమో, ఒట్టూ, నేను చూళ్ళేకపోయాను
అది ఎల్ల కాలమూ అక్కడేఉన్నట్టు
జలంతా గేవార్ని చెప్పమను చూస్తాను !
తళుకుగల మధురసం అతిథులకి అందగా
అబద్ధం అనే తెరకనబడేదేకాదు
ప్రతిపానపాత్రకీ అట్టడుగుభాగాన్ని
పరమసత్యం నాకు ప్రత్యక్షమయ్యేది.
ఇక ఇప్పుడా ! నిజం, సత్తువగతించింది
పళ్లొచ్చిపడ్డాయి, క్షీణదశ తెచ్చాయి,
మిగిలిపోయినజుట్టు గుప్పిడికిరాదామె
ఆనాళ్లు పరకలూ నెరసికూచున్నాయి !
అయితేమి, జలేశం ఎంతముసిలి అయినా
తన ఉషార్ చావలేదని అతనికి గర్వం

చల్లారి నుసిపడ్డ తనవయసు నివురులో
యవ్వనాగ్ని దాపతు రవ్వ ఉందంటాడు.
(అంటూ ఉత్సాహంగా LM కి పోతాడు.
రెండవ తెర పడుతుంది.)

[L F నించి వచ్చి, RF కేసి నడిచి, మళ్ళీ వెనక్కి వచ్చి వేషం సర్దుకుంటూ తంపటి కంగారుగా ఉంటాడు. RF నించి పరిధానం తొందరగా వస్తాడు.]

ప.—ఏంరా తంపటీ! ఆమె వయినం బొత్తిగా దొరక లేదూ? ఎక్కడికి వెళ్ళిందో తెలుసుగో లేకపోయా వన్న మాటే!

తం.—నిజం చెప్పాలంటే, అంతేనండి. తెలుసుగో లేకపోయాను. తండ్రిగారికి తెలియకుండా ఇంటొంచి పారి పోయిందని అడ్డమైనవాళ్లూ అనడమే. గాజూరావుగారు, ఆవిణ్ణి వెతుకుతున్నారనికుడా కింవదంతి. ఆవిడ ఎక్కడికి వెళ్ళిందో ఏమయిందో ఫలానా అని చెప్ప సాహసించిన వాడు ఒకడూ లేడు.

ప.—ఓరిశనీ! చావుబాజా! మొద్దూ! ఎక్కడికి వెడుతుందిరా, ఊళ్ళోంచీ!

తం.—నేనూ అల్లానే ఊహించుగున్నానండి, నాలో నేను, "ఓరిశనీ! చావుబాజా! మొద్దూ! ఊరుదాటి ఆవిడి

వెళ్ళిఉండమురా!" అని నాతో చెప్పేసుగున్నాను. అయితేం, ఎవరో చక్కా వచ్చి ఆవిడ ప్రేమ ఉండబట్టలేక ఉరిపోసుగుం దన్నారు. మరో డొచ్చి నభోమణిగారు ఆవిణ్ణి లేవదీసుకు పోయూడన్నాడు.

ప—అది అబద్ధంరా, దుర్మార్గుడా! అల్లా ఎవ్వడూ అనలేదు.

తం—అల్లానాండీ! అయితే సరే వాళ్ళమాటలు నేను అపార్థం చేసుగుని ఉంటాను.

ప—ఛీ, పో, మూర్ఖా, ఇంట్లోకి, పో! ఆమెగురించిన వైనం తెస్తేగాని, నువ్వు నాకు నీ మొహం చూపించకు.

తం—(L F కి వెళ్ళడానికి తటపటాయిస్తాడు.)

ప—(వాణ్ణి తరుముతూ LF కి నిష్క్రమిస్తాడు.)

మం—[RF నించి ప్రవేశించి] అబ్బ! (అనినిట్టూర్చి) ఇప్పటికి ఆవిణ్ణి పదిలంగా లేవదీసుకు రావడం అయింది. ఇక పెళ్ళి చేయించేవా డొకడు దొరికితే చాలు, నా పెళ్ళి అయిపోతుంది. నభోమణి ఆ విశాలని పెళ్ళాడనీ. మాననీ, వాడిష్టం!

ప—(LF నించి అప్పుడే వెనక్కి వస్తూ) ఏమిటయ్యా! నువ్వు 'విశాల' గురించి ఏమిటో అంటున్నావు?

మం—ఓహో! నువ్వా! పరిధానానివా! కాబోయే బావా! ఇక్కడ నువ్ కనిపిస్తావని ఎవడనుకున్నాడు?

ప—సరే సరే! ఏమిటి విశాల సంగతి!

మం—ఒట్టు. క్షమించాలి నువ్వు. ఈఉదయం నేను తిరుగుతూండగా ఒక మతాబాలాంటి యువతి నాకు కనబడి తనపేరు విశాల అని చెప్పి తనని రక్షించాలని నన్ను అర్థించింది.

ప—ఏమిటీ ?

మం—తండ్రికి తెలియకుండా లేచి వచ్చేశానంది. తండ్రి గాజూరావు అని చెప్పింది. ఒక యువకుడిమీదప్రేమే ఆ పలాయనానికి కారణం అంది.

ప—ఓయి దేవుడా ! అమాట ఒప్పేసుగుంటా ?

మం—ఓ, తెగేసిఒప్పేసుగుంది కాని మరోముక్క అంది. తన ప్రియుడికి తన పలాయనం సంగతి తెలియదంది. అసలతడు తన సంకల్పమే ఊహించి ఉండ లేడంది.

ప—(తనలో) ఓహో ! చిన్ని ప్రేయసీ ! నిజంగానే నీసంకల్పం ఊహించుగోలేకపోయాను. ఇంతసౌఖ్యం ఎవడికి ఉంటుంది ! (పైకి) సరే సరే, మరేమిటి మండోదరా ?

మం—తన ప్రియుణ్ణి ఎల్లాగేనా వెతికి పట్టుగోమనీ తనని అతడి దగ్గిర చేర్చుమనీ నన్ను ఎంతో బతిమాలు కుంది.

ప—హా దైవమా, దైవమా ! ఎంత అదృష్టం ! అయితే, రా, అల్లా కళ్ళప్పగించి ఊరుకుంటావేం ? నడు వెడదాం, (అని మండోదరాన్ని చెయ్యిపట్టుగు లాగుతాడు.)

మం.—ఏడిసినట్టేఉంది! మనం ఎక్కడికి వెళ్ళడం? ఎందుకూ?

ప.—అయితే మరేమన్నా జరిగిందా ఏమిటి?

మం.—మరేమన్నానా! ఆ, జరిగింది. ఏమైందంటే ఆవిడ విన్నపాలతో నామనస్సు కరిగింది. ఆవిడ కోరిన ప్రకారం వ్యవహరించాను.

ప.—సరే, ఆవి డెక్కడుం దిప్పుడూ?

మం.—ఎక్కడుందా? సరే, నే నిప్పుడు చెప్పే శానుగా! ఆవిడ కోరినప్రకారం నేను వ్యవహరించి, ఆవిణ్ణి భద్రంగా తీసికెళ్ళి ఆవిడ ప్రియుడి ఒళ్ళో ఉంచాను.

ప.—ఓయి! నీదేవుడుకాలా, నన్ను హేళనచేస్తు న్నావు! నే నావిణ్ణి చూడందే!

మం.—నువ్వా? నీదేవుడు సంతకెళ్ళా! నువ్వెందుకు చూడాలి ఆవిణ్ణి! ఆవిడ నభోమణిని కోరుకుంది. ఆవిణ్ణి అతడిదగ్గిరే దిగబెట్టేశాను.

ప.—(తనలో) ఔర! ఔం! ఇదే నరకం, ఇదే పిచ్చి! (పైకి) అతడు నభోమణే?

మం.—అవు నవును. నభోమణే! మన నేస్తం. అందులో మంచి తమాషా ఓటుంది. మొట్టమొదట వాడు తెగ మొహమాట పడ్డాడు. బోలెడుసోది మొదలెట్టాడు— గౌరవం అనీ, అంతరాత్మ అనీ, ఎవడో ప్రియస్నేహితుడికి

ద్రోహం అని ఏమిటేమిటో! కాని. దైవకృపవల్ల, అల్లాంటి యాక్సిడెంటేం కొట్టిపారేశాం.

ప—నువ్వే కొట్టిపారేశావా?

మం—ఓ. నేనే కొట్టిపారేశాను. అందులో మళ్ళీ తక్షణం కొట్టిపారేశాను.

(వాడు)—ఇదెంత మోసమో, అన్నాడు.

(ఆవిడ)—ఛీ పోవయ్యా! ప్రేమలో మోసమే న్యాయం. – అంది.

(వాడు)—అమ్మో! అవతల నా స్నేహితుడే, అన్నాడు.

(నేను)—స్నేహితుడూ లేదు సింగినాదం లేదు, వాణ్ణే డవక! అన్నాను. అందుకని ఆ దిక్కుమాలి స్నేహితుడికి ఏకోశాన్నా ఆశ లేదు. అబ్బెబ్బే! ఏదైనంత శీఘ్రంగా వాడు ఉరేట్టుగుంటేనే నయం.

ప—(తనలో) ఇక్కణ్ణించి నేను వెళ్ళిపోతాను. లేకపోతే బయట పడవలసొస్తుంది. (అని LF కి వెళ్ళబోతాడు.)

మం—ఆగాగు. వెళ్ళకుమరీ! ఈ తమాషాలోకల్లా అసలైనపట్టు నువ్వింకా వినలేదు.

ప—నీ తమాషా నాశనంఆయిరి లేస్తూ!

మం—అయ్యోకర్మమా! ఏమిటి సంగతి ఇప్పుడూ? దీనివల్ల నీకు కాస్త వినోదం కలుగుతుందని ఎంచాను.

ప—నిన్ను చక్రబంధంలో ఇమిడ్చి, చిత్రవధ చేసి, నాశనం చెయ్యాలి !

మం—ఏమిటీ ! అతడు చెప్పిన ప్రియస్నేహితుడవు నువ్వే కావుగదా ! కొంపతవ్వి ! (అతణ్ణి పరీక్షగా చూస్తూ) ఆదుగో అదుగో మొహంలో కనిపిస్తూంటేనే, రూఢే, నువ్వే ! నువ్వే ! (అని నవ్వుతూ) ఓరి నీయిల్లు బంగారం గానూ, దానికంటె ఇది మరీ తమాషారకం తస్సాలాఉందే ! హారి, హారి (అని నవ్వుతాడు)

ప—ఏమిట్రా ? ఇందుకోసం నవ్వుతావా ? రాతి గుండె అల్లరిబైతుకానా ! (అని వాడిమెడ పట్టుగుని గుంజి) నాఅంతవాడి కోపానికి నీవంటి నీచుడేమిటని ఊరుకుం టున్నానుగాని లేకపోతే ఈపాటి నీ గుండె బయటికి లాగి గిరవటేసి ఉందును.

మం—అయ్యో, అయ్యో ! క్షమించాలి, క్షమిం చాలి. ఇదేనా బావగారికి చూపించే మర్యాదా ?

ప—ఒరేయ్, నామాట జాగ్రత్తగా విను, పుంఢా కోర్ ! ఈదగా స్నేహితులిద్దరూ ఎక్కడికి వెళ్ళిపోయారో, చెప్పు ! లేకపోతే ఆత్మసాక్షిగా——(అని కత్తి దూస్తాడు)

మం—దేవుడు మొహంచూసి, ఓ చిన్నబావా, కోపానికి కొంచెం కళ్ళెంపట్టు. నువ్వు కోరింది వీలైనంత జ్ఞాపకం చేసుకుంటాను.

ప—అల్లాయితే త్వరగా కానీ అదేదో !

మం—అల్లానే, ఓ, అల్లానే. కాని అందరి జ్ఞాపకాలూ ఒకేమోస్తరుగా ఏడుస్తాయూ ? కొందరికి మహా ద్రోహకరమైన జ్ఞాపకశక్తి ఉంటుంది. నా జ్ఞాపకశక్తి కేవలం పిరికిరకం—పిచ్చికత్తి దర్శనం అయేసరికి అది పిక్కబలం చూపించేస్తుంది—ప్రమాణపూర్వంగా దానిగుణం అంతే. నేను ఎవరపడి కాసుగుంటేనే నయంగాని జ్ఞాపకం చేసుగుని ఇక లాభంలేదు.

ప—ఓరి పిరికిదేవుడా ? అయితే సత్యం చెప్పెయ్, నిన్నేమీ చెయ్యను.

మం—అబ్బెబ్బే ! నన్ను నువ్వేమన్నా చేసిపోతావని కాదోయ్, ముద్దుబావా ! కాని అదుగో నీచేతులో ఉందే ఆ దిక్కుమాలి స్వరూపం—

ప—అయితే చెప్పనే చెప్పవా నాకు ?

మం—ఎంతమాట ఎంతమాటా ! విధాయకంగా చెబుతాను. సమగ్రంగా చెప్పేస్తాను, ఆత్మసాక్షిగా ! కాని, అల్లా కత్తి చేతబట్టే పినాలా ఏముటోయ్, దాని మొహం ఈడ్చా !

ప—అయితే, సరే ! (కత్తి ఒరలో వేసేస్తాడు) ఇప్పుడు చెప్పు.

మం—ఆఁ సరే. వాళ్ళిద్దరూ ఎక్కడికి వెళ్ళారని నా నమ్మకం అనగా—ఈసంగతేనా, నాకు పిశాలని దిగ

బెట్టివచ్చిన కరాళం అనే స్నేహితుడు చెప్పినమాటస్మీ — అదుగో, నా ముద్దు పరిధానం! నీచెయ్యి దాని దగ్గిర్నుంచి కాస్తంత ఎడంగా పెడుదూ నీపుణ్యమాయిరి – ఎక్కడికి కనగా, గోమాత మతానికి.

ప—గోమాతా!

మం—అవును. నభోమణి ఆవిడకోసం అక్కడికి వచ్చిఉన్నాడని!

ప—ఇది యథార్థమేనా?

మం—ప్రమాణపూర్వంగా! పూర్తిగా! నే బతగా లనుకున్నంత ఒట్టు!

ప—సరేసరే! పిరికిపందా! బతుకు! సత్యగౌరవాలు లేని ఆ మణిగాడు చవిచూస్తాడు లే నాకసి!

మం—అదీమాట. వాణ్ణిచంపు, వాడిమెడ ఉత్తరించు! ఇదే నీకు నాస్వాగతం.

ప—కాని, విశాల! ఆవిడకొచ్చే అప్రతిష్ఠ చాలు! ఆవిడమీంద నా కోపంకూడా ఎందుకూ?

మం—అఖ్ఖర్లేను, అఖ్ఖర్లేదు. చిన్నారిబావా! ఆవిడ మీంద, నేనైతే, అసలు కోపపడను. ఆవిడికి అసలు ఆ అర్హత ఏడిస్తేనా?

ప—అల్లాకాదు, అనవలసింది. ఆవిడ శత్రుపక్షంలో ఉండడానికి అర్హతగలవాళ్ళు రాజకుమారులు.

మం—ఆమాటా నిజమే. నిజమే. ఆవిడ అంతటిదే! ఆవిడ నీకు దక్కనందుకు నీమీద నాకు వెర్రి జాలివేస్తుంది.

ప—నోరుముయ్, లుచ్చా! నన్ను గురించి జాలిపడ డానికి ధైర్యంగుడానా నీకు?

మం—లేదు, బావా, లేదులేదు. నీ క్షమాపణ కోరుకుంటున్నాను, క్షమించు. నిన్ను గురించి నేను ఎంత మాత్రం జాలిపడటంలేదు, దైవసాక్షిగా!

ప—అయితే, ఫో, అవతలకి ఫో, శీఘ్రంగా! మూర్ఖశిఖామణీ! ఇంకా నాకు కోపం తెప్పించకు. నీ అనా మకత్వం ఒక్కటే నిన్నిప్పుడు రక్షించింది.

మం—(తనలో) నా అనామకత్వం ఒక్కటే నన్ను రక్షిస్తే అదే నా ఉత్తమస్నేహితుడు. (పైకి) వెళ్లొస్తాను, పరిధానం! (RF కి నడుస్తూ తనలో) ఏకకోపం, వీడి కోపం నాశనంగాను! వెధవపొగరు! లోకువ కనిపెట్టి ఎగిరిపడేరకం! చంపేసునీపాటి! (అని RF కి వెళ్ళి పోతాడు.)

(పరిధానం వాడికేసి తీవ్రంగా చూస్తూండగా, తెర)



# రంగం-5

[రెండో తెర లేవగా, మరంతాలూ ను తోట కన పడాలి. కిశోరీ, విశాలా ఉంటారు. విశాల సన్యాసినీ వేషం లో ఉంటుంది.]

కి—నూ అన్న నిన్ను తెలుసుకో కూడదనే నీ యత్నం, నిజంగా ?

వి—అవును. లేకపోతే నే నింత వేషం ఎందుకూ వెయ్యడం ?

కి—అహం, ఒక వేళ ఈ వేషం నీకు బాగుంటుందని వేసుగున్నావేమో, అని. నీకు జన్మ అంతకీ సన్యసించేద్దామని సంకల్పం కాదుగా ?

వి—నిజమే, పరిధానం వచ్చి రాత్రి నాకు కోపం తెప్పించకుండా ఉండిఉంటే, నాకు అటువంటి సంకల్పం కలక్కపోయుండును.

కి—చాల్లేస్తూ! ఇంత బ్రహ్మాండం చేస్తావేమిటి! నువ్వు ఎక్కడ దక్కకుండా పోగలవోనని అతడు దురుసుగా వ్యవహరించి ఉంటాడు.

వి—నన్ను కఠినురాలని భావిస్తే భావించుగాని— నేను ప్రమాణం చేసి చెబుతాను—అతడు ఇప్పుడు ఇక్కడ ఉంటే అతణ్ణి నేను క్షమించి పారేస్తానేమో అని నా నమ్మకం.

మనప్రియుడు మనకెంత బాధకలిగించినా
చిటికెలో ఎగురుతుందా కోపమంతాను.
ఒకరోజు విడచుండనీ, సగం సగం అయి
అతడొచ్చి కలియనీ, పూర్తిగా పోతుంది.
రాత్రి మీఅన్న విహరించుతూ వచ్చిపడి
నామనసు కలిచాడు, సాగనంపేశాను.
నిజంగా అతిమోటు సాహసం చేశాడు
తగినశాస్తి అయింది, నన్ను గోల్పోయాడు.
అయినాసరే ఇప్పుడత డిక్కడుండనీ
శృంగభంగం నాకు దూషి అయినాసరే
నా నాలికాతణ్ణి మందలించేముందు
నాకన్ను లతణ్ణి క్షమించివదుల్తాయి.

కి—గట్టిగా అంటున్నానని, ఏమీ అనుకోకు గాని, విశాలా! నువ్వు సన్యాసినిగా ఉపక్రమణం చెయ్యడానికి గాఢంగా తీర్మానం చేసుకున్నట్టున్నావే!

వి—అవును గాఢంగానే ఆలోచిస్తే, సన్యాసినీ వేషధారణం నాకు ఉత్తమం కాకపోతుందా, అని నా సందేహం.

కి—సరే, సన్యాసినీవేషధారణం అనేది, ఎక్కడేనా తమాషాకోసం వేషాలు వేసుకునేటప్పుడు ఉచితం. అంతేకాని, చక్కని రూపంగలిగి, స్నేహాలో ఉంటూ

ఎవర్తేనా యువతి కాస్సేపు, కూస్సేపు ఇల్లా ఉంటుందిగాని ఎక్కడేనా ఎల్లకాలం ఈవేషంలో ఉంటాననుకుంటుందా ?

వి___(RF కేసి చూసి) అదుగో అదుగో, నీమణి వస్తున్నాడు. నేనుంటే విరాకు అడ్డువడాయా! ఆహా! కిశోరీ! ఆయన్ని కళ్ళారా చూసుగోడానికి ఎంతతొందర పడు తున్నావోగదా! (అని LM కి వెళ్ళిపోతుంది.)

[RF నించి నభోమణి వస్తాడు.]

న___ఏం? కిశోరీ! నేవెళ్ళింతరవాత, ఏమిటి విశే షాలు ?

కి___ఏమీలేవు. మా నాన్నదగ్గిరికి ఉత్తరం తీసి గెళ్ళినవా డింకా తిరిగిరాలేదు.

న___సరిసరి నామనస్సు చెప్పేస్తాను. ఆయనదగ్గి ర్నించి వచ్చేదాల్లో మనకేమీ ఉత్సాహం ఉంటుందని నేననుకోను.

కి___ఆయన్ని అడిగిచూస్తేనే నయం. మినస్సు ఎక్కువ స్థిమితంగా ఉంటుంది. నీ త్రికరణశుద్ధిగురించి సందే హంలేదు. కాని దారిద్ర్యం అనేమాటలో గుండె ఝల్లు మనిపించే గుణంఉంది. అదెరగనివాళ్ళకి దాంతో సంబంధం వద్దనిపిస్తుంది. ప్రేమని మనం ఇంటిదైవంగా చేసుకునేటప్పుడు ఆప్రేమకి ఇమ్మైన ఇల్లొకటి కట్టుదిట్టం చెయ్యాలా వద్దా ?

న___ఔరా! కిశోరీ! అవతల ఒక మహారాజుతో సింహాసనం ఎక్కేరాణిగా నన్ను చేసే సంబంధం దొరికినా,

నామణిని నేను విడిచిపెట్టను అని ఎన్నిసార్లు అన్నావు ఇది వరకు? ఆ వెర్రిబడాయికబుర్లు అననే లేదంటావా ఇప్పుడు? ఈ దయగల పెదవులూ, కోమలమైన నాముద్ర పొందిన ఈ హస్తమూ మూలంగా గొప్ప ఐశ్వర్యానికీ, గొప్ప శక్తికీ నాకు అధికారం వస్తూంటే, దైవసాక్షిగా ఇవి నేను వదులుకో లేనే! రాజ్యాలవల్ల లభ్యంకానిది నాదైనప్పుడు మనం ఎల్లా దరిద్రులమౌ ఆత్మసాక్షిగా చెప్పు. నా సత్యహృదయానికి నువ్వు రాణివి. నిన్ను సేవించడంలో నేను రాజుని. మన్ని ఎవరూ ఆజ్ఞ పెట్టలేరు. మనధన్యత అన్యోన్యం. తరగని ప్రేమ గనులే నాధనం. నా పెదవుల మీంచి సంపదలు నువ్వు లాక్కో, నీ పెదవులమీంచి రాజ్యాలు నే పుచ్చుకుంటాను.

కి—(RF కేసి చూసి వెళ్ళి ఒకఉత్తరంతో తిరిగి ప్రవేశిస్తుంది.) ఇది మానాన్న సమాధానం అయి ఉంటుంది.

న—నే చెబుతా విను. ప్రియ కిశోరీ! దాంట్లో బెదరింపులూ, తిట్లూ తప్ప మరేమీ ఉండదని రాసిస్తాను.

కి—ఏముంటేం? చూద్దాం! (ఉత్తరం విప్పి చదువుతుంది)—"ఇష్టతముురాలా, కుమారీ! నీ ప్రియుణ్ణి సౌఖ్యవంతుణ్ణి చెయ్యి. నీకు కలిగిన ముచ్చట చొప్పున నువ్వు పెళ్ళి చేసుగోడానికి ఇదే నా అంగీకారం! తప్పకుండా ఇంటికి వచ్చేసి కలిసి విందారగిస్తావని ఎదురుచూస్తూన్న నీ ప్రియ జనకుడు."

న—వేళాకోళంగా చదివావా, కిశోరీ!

కి—(ఉత్తరం ఇచ్చి) ఇదుగో, చదవకూడదా !

న—(ఉత్తరం చూసి) ఔను. కిశోరీ ! నిజమే. దైవమా ! నిశ్చయంగా ఎక్కడో హెచ్చుతగ్గు ఉంది. కాని ఆ గోష మన కెందు కిప్పుడూ!—మరి కిశోరీ ! మరి ఆలస్యానికి నెపంకుడా లేదు.

కి—అందుకని, మనం మాయింటికి కెళ్ళిపోయి, మానాన్నకి నమస్కారాలు పెట్టి రావద్దూ ?

న—ఆయన తరవాత పేచీ ఏమీ పెట్టడానికి వీల్లే కుండా, పెళ్ళి కానిచ్చెయ్యనీ పురోహితుడొచ్చి ! నేను పరి గెట్టివెళ్ళి ఓణ్ణిలాక్కొస్తాను.

కి—అమ్మో! ఇప్పుడు నువ్వు నన్ను విడిస్తే బహుశా నీకు నేను లభించనేమో !

న—అయితే, నాతో వచ్చెయ్ ! ఈపక్కనే ఒక మఠాధికారి ఉన్నాడు నాస్నేహితుడు. నువ్వు ఇప్పటిదాకా కొంతవరకు సన్యాసినీ మఠంలో ఉండే రీతులు గమనించి పొద్దుపుచ్చావు. మొగసన్యాసుల మఠంలో ఉండే మహాను భావుల్లో మోసం తక్కువేమో గమనించుదాం, రా.

కి—ఆభయం అవసరంలేదు. సన్యాసులు, సన్యాసిను లకి తీసిపోయే రకంకారు. మతంలో—స్నేహంలోలాగే— ఎవరేనా ఎంత హడావిడి చేస్తారో వాళ్ళల్లో త్రికరణశుద్ధి అంత తక్కువ.

న—రా, రా. (అని RF కి నడవగా, వెనకాలే **కిశోరి వెడుతుంది)**

[LF నించి విశాల వస్తుంది]

ని—అదుగో! వెడుతున్నారు, అదృష్టవంతులు— సుఖంగా! ఒకర్నొకరు ప్రేమించి, ఒకరితో ఒకరు ఒప్పేసుగున్నవాళ్ళు ఎంత సుఖంగా ఉంటారో వీళ్ళంత సుఖంగా నడిచారు. నన్ను ఒంటరిగా వదలేసింది కిశోరి, ఔరా! కిశోరి తన ప్రియుడితో పారిపోయిన సాహసం—నాకూ ప్రేమంటే తెలుసునుగనక, నేనుక్షమిస్తాను. కాని నాప్రేమక లక్ష్యం అయిన పురుషుడి సాన్నిధ్యం నాకు లభించి నప్పుడు గాని దీన్ని నేను తట్టుగోలేను. (LF కేసి చూసి) ఆఁ ఆఁ! ఎవర్ని నే చూస్తూన్నదీ! పరిధానం! రూఢిగా అతడే! నే నున్నంతరూఢి! ఈ ఆవరణలోకి ఎల్లా ప్రవేశించాడు చెప్మా! ఠంకం చెల్లించాడు గావును, నభోమణిలాగే! ఇతడు చాలా ఆదుర్దాగానూ కంగారుగానూకనిపిస్తున్నాడు. (ముసుగు వేసుగుంటూ) నన్నప్పుడే గుర్తుపట్టకూడ దీయన గారు! (అని జరిగి R కేసి తిరిగి RM దగ్గర నుంచుంటుంది)

[RF కేసి చూస్తూ. LF నించి పరిధానం తొందరగావచ్చి మధ్యలో ఆగుతాడు]

ప—(తనలో) వాళ్ళే వాళ్ళే! తప్పకుండా వాళ్ళే-నే విన్నది నిసలే.

వి—(అతనికి ఎదురు వెళ్ళి) ఏంపని, స్వామీ: మీ కిక్కడా?

ప—(వినిపించుగోకుండా) కానీ, కానీ! (అని RF కి పరీక్షగాచూసి) అరే! ఆగుతున్నారే! (నిదానించి) అదుగో ఆ రాకాసి, విశాలా!

వి—(అతని వెనక్కి LF కేసి వచ్చి తనలో) ఓహో, ఈ పొరపాటులో ఎంత ఈర్ష్యా ? ఈయన ఇల్లా బాధపడడం నాకు సంతోషంగా ఉంది.

ప—(తనలో, అటేచూస్తూ) అబ్బో! మారువేషం కూడా వేసింది! వేషంవేస్తే దాగుతుందా! అబ్బో! నే నాపిణ్ణి పోల్చలేనూ!

వి—(తనలో) చాలా అద్భుతంగా పోల్చగలరు (పైకి) మహాశయా!

ప—ఏమమ్మోయ్, సన్యాసినీ! నీ పుణ్యమాయిరి, కాస్సేపు ఊరుకో, నన్ను బాధించకు! (అటు దీక్షగాచూసి) అయ్యో దేవుడా! అది వాడి చేతిమీద ఎల్లా ఆనుకుం టుందో! ఆప్యాయంగా చేతిమీద ఎల్లా వేళ్ళాడిపోతోందో! ఔర, ఆడదానా, ఆడదాన!

వి—ఏమండి! మీరొచ్చింది ఎవరికోసం?

ప—నీకోసంకాదు, సన్యాసినీ, నీకోసంకాదు, నీకు దణ్ణం, నన్ను విసిగించకు! (అని వెంటనే ఆగి) చూడండీ సన్యాసినిగారూ, మీరు మహాదొడ్డవారు. ఇక్కణ్ణించి, ఇప్పుడే అల్లా వెళ్ళింది విశాల అనే అమ్మాయికాదూ?

వి—విశాలాండీ! విశాల ఈతోట దాటిఉండదు.

ప—ఆఁ, నేనల్లాగే అనుకున్నాను. నాకు తప్పా స్తుందా? అయితే, దయచేసిచెప్పూ ఆవిడతో కూడా ఉన్నవాడు నభోమణి అనే పిల్లవాడేనా?

వి—అవునండి.

ప—అల్లాగా! సరేసరే, మరొక్క ప్రశ్న—వాళ్ళల్లా కలిసి లేచిపోతున్నారుగదా, ఆ లేచిపోవడంయొక్క ఉద్దేశం ఏమన్నా నువ్వెరుగుదువా, సన్యాసినీ!

వి—ఉద్దేశమాండీ! పెళ్ళిచేసుగునే ఉద్దేశమే! అని నేననుకుంటాను.

ప—సరేసరే, చాల్లే సన్యాసినీ. నేవెళ్ళి ఆ పెళ్ళి ఎగరగొట్టకపోతేగా! (అని గబగబా RF కి పరిగెట్టి వెళ్ళి పోతాడు.)

వి—(ముసుగు తీసేసి) ప్రేమవంతులు ఈర్ష్యలో పడ్డప్పుడు, దృష్టి చురుకౌతుందని అనుకుంటోచ్చాను. కాని, ఇప్పుడు నాకు కళ్ళు కనిపించనేలేదు. ఈయన ప్రమాదంలో ఎందుకు పడ్డాడో, కిశోరి చెప్పిన సమాచారంవల్ల నాకు తెలుస్తోంది. ఈయన్ని ఈమాత్రంగా చికాకుపరచడానికి శక్తి నాలో ఉన్నందుకు నాకు సంతోషంగాఉంది. ఈ మోసంలో ఉండే యధార్థం తెలిసిపోగా ఈయన తెల్ల మొహం వేసే తరుణంలో, ఆచోట, నేనుకూడా ఎందుకు ఉండకూడదూ? వాళ్ళని చూస్తూ ఈయన నడిస్తే ఈయన్ని చూస్తూ నేను నడుస్తాను. కిశోరి ఒక్కర్తేనా ఏమిటి పెళ్ళికూతురు! ఈ వేషంపని వేషం చేసేసింది, నాపని నేచేస్తాను. (అని ఆముసుగూ, సన్యాసినీ వేషం నిమిత్తం ధరించిన ఇతరపరికరాలూ అక్కడ పారేసి, RF కి వెళ్ళిపోతుంది.)

(తెర)

---

# రంగం-6

రెండో తెర ఎదట—తోట ఎదటి స్థలం

[RF నించి నభోమణీ, LF నించి మండోదరమూ వచ్చి ఎదురవుతారు]

న—ఇదుగో, మండోదర మహాశయుడూ!

మం—ఏం నభోమణీ! నాకు సుఖం కోరవేం? కోరని భద్రంగా లాక్కొచ్చేశాను.

న—లాక్కొచ్చేశావా? నీకు సుఖం కోరుతున్నాను, మనసారా!

మం—తథాస్తు! ఆ పెళ్ళికాస్తా చేయించెయ్యడానికి ఎవడేనా పురోహితుడు దొరుకుతాడేమో అని వెతుకుతున్నాను.

న—ఓయి నీతస్సాగొయ్యా! నేనూ ఆపనిమీదే ఉన్నానయ్యా! పెళ్ళిళ్ళు చెయించే క్షీరసాగరం ఇటు వచ్చాడంటే అతడికోసం చూస్తున్నాను.

మం—అల్లాగా! చాలా సంతోషం. కాని వాడు మాకు ముందుగా ముడేసెయ్యాలి. నా ప్రేయసి నిరీక్షిస్తోంది.

న—నాప్రేయసీ అంతే. తోట తూర్పు ద్వారందగ్గిర ఆవిణ్ణి కూచోపెట్టి వచ్చాను.

మం—పైగా నేను తక్షణమే జలేశంయింటికి వెళ్ళవలసినపనిఉంది.

న—నాకూఉంది.

మం—అయితే, వీళ్లైనంత వ్యవధి కలిసిరావడానికి, అతడు మన పెళ్ళిళ్ళు ఏకముహూర్తంలో జోడించేస్తేసరి! నీకు పెళ్ళిపెద్దగా నేనుంటాను, నాకు నువ్వుండు. తీరిపోతుంది. నేనింత చేస్తూన్నందుకు నువ్వు నాకు కృతజ్ఞుడవై ఉండాలి.

న—అడ్డమా! నువ్వు (LF చూపించి) ఇల్లా వెళ్ళిరా! నేను (RF చూపించి) ఇల్లావెళ్ళి అల్లా తిరిగి వస్తాను. అతడు కనపడితే వదలద్దు, కట్టేసేనాసరే ఈడ్చుగు రావాలి.

మం—జుట్టుట్టుగుని బరబరా......(అంటూ LF కి వెడతాడు.)

న—(ఒక్కడూ) నేనిప్పుడు వెళ్ళొచ్చాను. ఆ పురోహితుల కూటమికి! ముగ్గురూ లోపల దెబ్బలాడుకుంటు న్నారు ముడుపులాభాల పంపకాలలో! తప్పుడుమాటలు వినిపిస్తూనే ఉన్నాయి! నౌఖరు వాణ్ణడిగితే లోపల ఎవరూ లేరన్నాడు. వాడిచెయ్యి (?)డిచేసేసరికి వాడు యథార్థం చెప్పేశాడు—క్షీరసాగరం లోపలే ఉన్నాడండీ, బుద్ధి మర్యాదలో ఉన్నారు, నాకుమాత్రం ఆకలీదప్పీ లేదు. టయ్యా అంటే నీకు దుంపలూ నీళ్లూ ఉన్నాయి చాలవా పొమ్మన్నాడండీ—అన్నాడు. వీడెళ్ళి ఏం చేసుకొస్తాడో చూద్దాం.

[LF నించి సంతోషంతో మండోదరం వస్తాడు]

ఏం నేస్తం, ఏమయింది ?

మం—ఏమవుతుందీ, నేవెళితే ? వస్తున్నాడు.

స—కనిపించాడా ?

మం—ఆ !

న—ఏస్థితిలో ఉన్నాడూ ?

మం—పొట్ట కుండలాఉంది. అల్లా ఉందేమని అడిగాను. అడిగితే, ఉపోష్యాల మూలంగా గాలిమాత్రమే పీలుస్తున్నాను, పొట్టతిత్తులు ఉబ్బిపోయాయి, – అన్నాడు. ముఖం ఇల్లా బుంగలాగ ఉందేం ? బుగ్గలు ఎర్రబడ్డాయేం, అన్నాను. అంటే, మానవజాతికి నేను ఎంతనీతి బోధ చేస్తున్నా వాళ్ళు పాపాలు చెయ్యడం మానకపోవడంనించి తనకి సిగ్గు ఎక్కువై పోగా బుగ్గలు అల్లా అయిపోయా యన్నాడు.

న—అబ్బ ! పెళ్ళిచెయించడం గురించి అడిగావా, మరిచిపోయావా ?

మం—అడక్కుండానే వస్తానా ? కనుక్కో కావలిస్తే. అడిగితే రహస్యవివాహాలు తను చెయించడానికి ప్రతికూలమైన కారణాలు చాలా బలువైనవి తన బుర్రలో ఉన్నాయన్నాడు. అంటే వాటికి అనుకూలమైన కారణాలు అంతకంటె బలువైనవి నాచేతులో ఉన్నాయన్నాను.

న—వస్తానన్నాడా ?

మం—ఆ. ఈ వ్యవహారంలో పాపం ఏదేనా ఉంటే, నా ఖాతానే కట్టుగోమన్నాడు.

న—సరే నువ్వు వాణ్ణి జుట్టుపట్టుగుని ఈడ్చుగొస్తా నన్నావే !

మం—అన్నాను. అంటేం ? వాడికి తీరాచూస్తే జుట్టులేదు. నడిచే రమ్మన్నాను. మనికి ఈడ్చుగురావడం శ్రమయెందుకని.

కి—(RF నించి పరుగులో వచ్చి) మణీ, మణీ ! పరిధానం వచ్చాడు. తోటద్వారందగ్గిర మన్నిగురించి వాకబు చేస్తున్నాడు.

మం—ఎవరూ ? పరిధానమా ? ఆవాకబు నన్ను గురించి ఎంతమాత్రం కాదనుకుంటాను.

న—భయపడకు ప్రేయసీ ! అతడికోపం నేను దింపేస్తాను నిమిషంలో.

మం—నీమొహం, నువ్వెక్కడ దింపెయ్యగలవ్. మణీ ! నామాటవిను. వెంటనే పరుగుచ్చుగో. ఈపరిధానం ఉన్నాడే వీడు దయాదాక్షిణ్యాలు ఏకోశాన్నీ లేని కర్కోటకుడు. వాడిచేతులో ఉండేటంత పొడుగాటి కత్తి ఎక్కడా ఉండదు, వాడికత్తి నాశనంగాను ! ప్రమాణంచేసి చెప్తాను, వాడిప్పుడు ఎందుకొస్తున్నాడంటే, నీమెడ ఉత్తరించడానికి.

న—ఛ, పోవయ్యా ! ఏమీ భయంలేదు.

మం—సరే అంత ధైర్యంఉంటే, నువ్వుండు కావలిస్తే. నాపెళ్ళి మరోడిచేత చెయించుగుంటాను. మోసదేవతా! వాడు మరోసారి నన్నెల్లా పట్టుకోగలడూ, నా పిక్కలు రెండూ నేచెప్పేమాట వినగలిగినప్పుడూ! (అని L F కి గబగబా పరిగెట్టిపోతాడు.)

కి—(ముసుగు వేసేసుగుంటుంది.)

ప—(RF నించి సరసరావచ్చి) ఏమయ్యా! చివరికి నిన్ను పట్టుకోగలిగానే!

న—ఏమిటి గ్రంథం!

ప—ఊరుకో, నీచపుద్రోహీ! కుళ్ళుదగా మన స్నేహితుని ఎక్కడ బయలుతెచ్చుగున్నావో ఇంత నిబ్బరమైన చూపులు! నన్ను బాధించి నా కేసి ఎల్లా చూస్తాడో ఏమీ ఎరగనట్టు!

న—పరిధానం! నువ్వు కొంచెం వేడిమీద ఉన్నావు. నాప్రాణంకంటె ఎక్కువగా నేను ప్రేమించే ఈమెను నేను పెళ్ళి చేసుగోబోతున్నాను అన్నమాట నిజమే. కాని, నేనేమీ ఈవిడికి నూరిపొయ్యాలేదు. ఈవిణ్ణి లేవదీసుకు రానూలేదు—మోసమంటే నీ కెంతరోతో నాకూ అంతే. నే నీవిణ్ణి కలుసుగునేవరకూ—దైవసాక్షిగా ఈవిడ తండ్రితో చెప్పకుండా వచ్చేసిందని నాకు తెలియదు.

ప—నీ నెపం ఎంత నీచంగాఉందో చూడు. స్నేహితుణ్ణైన నాకు అవజ్ఞచేశావు, ఆవిడకోసం! ఆవిడ అంత

చారవగా శృంగారం ఎందుకు చెయ్యాలీ అంటే నీమోసం ఆధారంచేసుకునే-ఇదంతా వాడు నాతో చెప్పాడు, ఈవిణ్ణి నీకు తార్చిన వడ్డీదాసు. కాని, నీ ప్రవర్తన సమంజసంగా ఉండనీ! మరి ఎల్లానూ నేరం చెయ్యడానికి, సాహసించావు గనక, రా, వచ్చి ధైర్యంతో నీచర్య సమర్థించుకో.

కి—మణీ! ఆయన తప్పు నాకు తెలుస్తోంది. నువ్వూరుకో.

ప—నువ్వే ఇచ్చావా వాగ్దానం?

కి—(తల ఊపుతుంది)

ప—విశాలా! నీపథానం నేను మెచ్చాను. ఇంత దన్న అబద్ధాలు నీ నాలికతో నువ్వు వెనకేసు గొస్తావేమో ఏమిటిధరీ అనుకున్నాను రక్షించావు. నేను నిన్ను ఒఖ్ఖ తిట్టుకుడా తిట్టకపోవడమే నీకు తగ్గశాస్తి అని జ్ఞాపకం ఉంచుకో.

[ముసుగులో విశాల LM నించి వస్తుంది]

వి—ఏమిటీ, ఈ గందరగోళం!

ప—మణీ! నీ కిప్పుడు బలంఉంది. మరో అప్పుడు కలుద్దాం. (RF కి వెళ్ళిపోబోతాడు)

(ఎడంచెయ్యి విశాలా, కుడిచెయ్యి కిశోరీ పట్టుగుని పరిధానాన్ని ఆపేస్తారు.)

కి—ఈవైపు తిరగవోయ్. నీ పుణ్యముంటుంది. కాస్సేపు కోపం తమాయించు.

వి__నీకు కోపం తగ్గడానికీ, నిన్నా పడానికీ నాసాయ ముండాలి.

కి__ఇంత దగ్గరదాన్ని పోల్చుగోలేవ్ నన్నూ ?

వి__ప్రియుడవైతే నన్ను విడిచి వెడతావేమి ?

(వాళ్ళిద్దరూ ముసుగులు తీసేస్తారు.)

ప__అయ్యో ! ఏమిటిదీ ? చెల్లాయ్ ? విశాల కుడాను-నాబుర్ర గడబిడ అయింది.

కి__అవును. అన్నయ్యా ! కాని కేవలం చెల్లెల్నే పోల్చుగోలేకుండా తయారయావే !

వి__కేవలం ప్రియురాల్నే తరిమేస్తున్నావే ?

కి__ఔర ! ఈర్ష్య, జనంయొక్క కళ్లు కప్పేస్తుంది.

వి__మళ్ళీ పడిపోరుగదా ! ఇల్లాంటి ఈర్ష్యలో ?

ప__ఎన్నడూ, ఎన్నడూ పడను. నువ్వు నన్ను క్షమించేస్తావని నాకు తెలుసును. కాని, విశాలా ! నువ్వు నన్ను క్షమిస్తావని అనుకోడం__

వి__అనుకోవద్దు. అనుకోవద్దు. ఇప్పు డిప్పుడేగా మిమ్మల్ని విసగించవద్దుపొమ్మంటిరి. "ఏమండీమీరొచ్చింది ఎవరికోసం ? అంటే "నీకోసంకాదు, నీకోసంకాదు" అనలేదూ? అయ్యో గుడ్డిలోకమా! మరెప్పుడూ ఈర్ష్యలో పడనని ఒట్టేసుగుంటే, మిమ్మల్ని క్షమిస్తాను.

ప__ఇదుగో, ఒట్టు అంతమీాదా__

వి__చాలు చాలు. మరి ఆగండి. మీరు పెట్టుగో దల్చిన ఒట్టు పాటించండి. నేను మీదాన్నే.

కి—అన్నయ్యా! నువ్వు క్షమాపణ చెప్పుగోవలసిన వారు ఇక్కడ మరొకరు ఉన్నారు.

ప—అవు నవును. మణీ! అదంతా తల్చుగోడానికే నాకు సిగ్గేసిపోతుంది.

న—క్షమాపణ అనేమాట ఎత్తుకు పరిధానం! ప్రేమలో ఉన్నవాడి కోపానికి అడ్డువెళ్ళకూడదని తెలుసుగో లేకుండానే ఉండిపోలేదు, నే నిన్నాళ్ళనించి ప్రేమవ్యవహారంలో! ఇకచాలు, మనం మరి వెడదాం రండి. వెడుతూ ఈ పొరపాటు ఎల్లా బయల్దేరిందో చెప్పుగుందాం. (అని అంతా LF కి వెళ్ళిపోగా రెండో తెర లేస్తుంది.

[జలేశం ఇంటివీధిగది. చిన్నబల్లా, కుర్చీలు ఉంటాయి.]

జ—(నడ్డిమీద చేతులు పెట్టుగుని LB నించి వచ్చి పచారుచేస్తూ) అన్ని శుభ్రంచెయించాను. నౌకర్లని ఏడుపు మొహాలెట్టి నుంచోక, కాస్త కలకలలాడుతూ నుంచోండర్రా అన్నాను. విందు పూర్తిఅయినతరవాత కావలిస్తే ఏడవ వచ్చును, ఈలోపలమాత్రం తెగతాగద్దని చెప్పేశాను. (LM కేసి చూసి) ఓరీ! తంపటీ!

తం—(LM నించి వచ్చి) అయ్యా!

జ—ఏడిరా, నీయజమానీ? విందువేళకేనా వస్తాడా రాడా?

తం—బహుశ, రారండి. నన్నడిగితే! అసలు వారికి మతిపోయిందని నా సందేహమండి. నేను మాట్లాడడానికి వెడితే నన్ను తరుము కొచ్చారండి.

జ—సరే సరే, ఎవత్తె వెనకాలో తిరుగుతున్నాడు గావును, దిక్కుమాలివాడు! తిరగనీ కుంకని! వాడికోసం ఆపుతానా విందూ? నువ్వెళ్ళు.

తం—ఇంకోసారి వార్ని వెతిగొస్తానండి (అని RF కి వెళ్ళి, మళ్ళీ అప్పుడే వచ్చి) అయ్యగారండి! తమకోసం మండోదరంగారు వచ్చారు.

జ—రమ్మను, రమ్మను.

మం—(RF నించి వస్తాడు.)

జ—ఏమయ్యోయ్! అల్లుడువాడా! నా ఆశీర్వాదమూ నా క్షమాపణా సీకిస్తున్నాను. ఏదీ మాఅమ్మాయీ? మా కిశోరీ?

మం—కొంతదూరాన్ని ఆగిపోయిందండి. మీఆశీస్సు కోసం తొందర పడుతోంది గానండి, లోపలికి అడుగుపెట్ట డానికి హడిలిపోతోంది.

జ—అయ్యో వెర్రివాడా! ఎగిరివెళ్ళి దాన్ని తీసుకు రావోయి.

మం—(RFకి వెడతాడు.)

జ—పిచ్చిపిల్ల! వెర్రిమొహమాని! ఆ ముద్దు మొహం చూడ్డం ఎప్పుడా అని ఉన్నాను.

మం—(RF నించి వచ్చి వెనక్కి తిరిగి) ఓసీ నా మంత్రకత్తీ! వణకిపోతూన్నా దేవదూతా! లోపలికి, రా! భయంలేదు.

[RF నించి కిసోరి వేషంలో, అమ్మతల్లి వస్తుంది.]

జ—(కిశోరే అనుకొని) ఇల్లా నా ఒళ్ళోకి, రా! అమ్మా! నా తల్లీ! (కిశోరి కాదని గ్రహించి వెనక్కి అడుగేసి) ఇదేమిటీ, ఈ పీనుగెవరూ ?

మం—న్యాయంకాదు, జలేశంగారూ! ఈవిణ్ణి క్షమిస్తానని తమరు లోగడ మాట యిచ్చున్నారు. చూడండప్పుడే నాచిట్టికూన కుంగిపోతుంది.

జ—కుంగిపోతోందీ ? నీమొహంలా ఉంది. నేను చచ్చినంతబట్టూ! ఇది ఆ ముసిలి మరగాలమ్మ! మరి, మా అమ్మాయి ఏదీ ? కిశోరి!

మం—అయ్యో! ఇదేమిటండీ, మీ కళ్ళఎదటా! ఈవిడే! (ఆవిడకేసి చూసి) అల్లా సిగ్గుపడకో, నాఅర్థాంగీ, నా తేనె!

జ—ఆ. అర్థాంగి! చచ్చు పదలగొట్టేసింది! ఓరి, దేవుడా! నువుగాని ఈ ఇంటిపెద్దమ్మని పెళ్ళిచేసుగున్నావా ఏమిటి ?

అ—(జలేశం కాళ్ళకి మొక్కుతూ) ఓ ప్రియజనకా, నాతండ్రీ! నన్ను కూతురేగాదు పొమ్మనరుగదా!

జ—ఓసి నీమొహం జీడెట్టా! జనకా, జనకాట! నీ పాడురూపానికి తగ్గట్టేఉంది నీపెడసరం!

మం—లే, లే! మెల్లిగా, లే, నా మంత్రకర్త్రీ లేచివెళ్ళి, మీనాన్న ఒళ్ళోపడి, నువ్వునువ్వేగాని మరో కర్త్రివి కావని, నాన్నగారికి నచ్చచెప్పు.

అ—(లేచి) నన్ను క్షమించండి, నాన్నగారూ! (అంటూ జలేశం ఒళ్ళో పడబోతుంది.)

జ—బాబో! బాబో! కూనీ కూనీ! నరకం! హత్య! ఈ ముసిలినక్కని తోలుకొచ్చావేమిరా, నామెడ పిసిగిచంపించడానికీ!

మం—ఏమిటండీ! ఆ కేకలూ! మీరెంతకూతురు గదా! క్షమించకుండా అంత రాతిగుండెతో ఉండడమా! చాల్లేస్తురూ! (RF నించి గబగబా. నభోమణీ, కిశోరీ వచ్చి మోకరిస్తారు.)

జ—ఓరి చక్కనాలి దేవుడా? ఏమిటిదీ! నిన్నెవరు రమ్మన్నారయ్యా? అసలు నువ్వెవరు?

న—ఈ యువతికి భర్తనండి.

మం—అవునండి, నిజమే, భర్తే. నేను ప్రమాణం చేసి చెప్పగలను. ఇందాకా పురోహితుడు మాకు లభించ లేదు కాని, నేనే ఈ కన్యని ధారపోసి ఉండేవాణ్ణి.

జ—ఓరి, నీమొహం ఇద్దైపోనూ! నువ్వే ధారపోసి ఉండేవాడివా?

మం—అవునండీ ఇతను నాస్నేహితుడు, నిజాయితీ మనిషి, నభోమణీ! నేను ఓపిల్లని ఇతడిమెడకి చుట్టపెడతా నని చెప్పలేదూ! ఆపిల్ల ఈవిడే!

జ—ఛీ, పో, నువ్వు తాగొచ్చేనా ఉండాలి. లేక నీకు మతేనా చలించిఉండాలి. ఈఅమ్మాయే నాకూతురు.

మం—ఛీ ఊరుకోండి. మీరు తాగొచ్చి ఉండాలి, పైగా మీకు మతికూడా పోయిఉండాలి—అని నేనను కుంటాను—ఈవిడా మీకూతురు !

జ—ఓ ముసిలిపాపిష్ఠీ ? ఈగొడవ ఏముటో తెలియ చెప్తావా, చెప్పవా ?

అ—అయితే, నేచెబుతా వినండి, జలేశంగారు !— ఈపాటికి మా వేషాలవల్లే మీరు సర్వమూ గ్రహించుగో వచ్చు. ఆవిడే మీ కూతురు. చూడండి. నన్నూ చూడండి.

మం—ఏమిటి అంటున్నావ్ ?

అ—యథార్థం వినండి. ఈవేళ పొద్దున్న తమరు క్రోధోద్రేకంలో పడిపోయినప్పుడు ఒక చిన్న తప్పిదం చేశారు. అదేమిటంటే మీఅమ్మాయినే మీరు ఇంట్లోంచి బయటికి సాగనంపేశారు. దీనవిధేయురాలినైన, నన్ను గదులోపెట్టి తాళంవేశారు.

మం—ఓరి దేవుడోయ్, ఓరి దేవుడోయ్ ! మా గట్టివాడవయ్యా ! కూతుర్ని తరిమేసి ముసిలి అవ్వని జాగర్త చేశావు !

జ—ఓరి దేవుడోయ్, ఓరి దేవుడోయ్ ! మాగట్టి వాడవయ్యా, నా కూతుర్ని వదిలేసి ముసిలిఅవ్వని వరించే శావు ! సరేసరే. తక్కినగ్రంధం ఏమిటి ?

అ—మరేమిడుందండీ ! కిశోరిస్థానం నే నాక్రమించి నందుకు, నాకు అదృష్టం పండింది. ఈ ప్రియనాథుణ్ణి వరించి వీరిమనస్సు హరించడానికి నాకు వీలుచిక్కింది.

మం—నాథుణ్ణా ! వరించావూ ! ఓసి ముసిలివరడూ! ఇప్పుడు అవుతానా నీకు నాథుణ్ణి ? అమ్మఎత్తూ ! అమ్మ మోసం ! మీాకందరికీగుడా సిగ్గుచేటు.

న—విను మండోదరం ! ఎవరో మోసంచేశారని ఇతడు ఫిర్యాదుచేస్తున్నాడు. జలేశంగారూ, ప్రమాణంగా చెబుతున్నాను. ఈ వడ్డీదాసే, పన్నడం మొదలెట్టి, అంతా తన నెత్తిమీాదికి తెచ్చుగున్నాడు. మీామీాద ఎత్తు వేద్దా మని యత్నించాడు. అదేమిటంటే, పిల్లయొక్క ఆస్తి యావత్తూ లాగేసుగుని, ప్రతిఫలం ఏమీా ఆవిడికి లేకుండా చెయ్యాలని సంకల్పించాడు.

జ—ఎత్తు నామీాదే ?

కి—అవును, నాన్నగారూ ! ఆసంగతి మేం ఋజువు చెయ్యగలం.

జ—నిజమే, నిజమే. అబద్ధాలాడితే నేనేపోతాను. లేకపోతే ఈ మరగాలమ్మ మొహంలాంటి మొహం చూసిం

తరవాత ఈ పీనుగు పెళ్ళికి ఒప్పుగుని ఉండడమేమిటీ! సరే సరే, ఓ చిన్నారిబృహస్పతీ! మనసారా కోరుతున్నాను నీకూ, నీఅర్థాంగికీ సౌఖ్యంఉండాలి—అని.

కి—మండోదరం! ప్రేమలో మోసమే చాలా న్యాయం! పన్నాగంసంగతి నీకు వదిలేస్తే సరికాదూ?

న—నువ్వు జిత్తులమారినక్కవి, కాదూ? పొట్టిగా ఉండే తుంటరి లుచ్చావి కావూ? ఏం?

కి—పోకరీ, బహుశా! కాని, కుశాగ్రబుద్ధి—దెయ్యపు తెలివి!

జ—అవునవును. వీళ్ళమేనత్త ఇతణ్ణెప్పుడూ "పొట్టి బృహస్పతి" అనేది.

మం—ఓయి టూకందరికీ పెద్దమ్మావారురాసూ!

క—మాకెల్లా వస్తుందీ, ఆవిడే పెద్దమ్మ!

మం—ఈ ఘటాన్ని, మీరంతాకలిసి, నానెత్తిని రుద్దితే నేను ఒప్పుతాననుకున్నారా?

న—మండోదరం! ఆలోచనచేసి నీతో ఓటంటాను విను. నీకు వచ్చేదాంతో తృప్తిపడు. ప్రజ్ఞగల జిత్తులమారి యొక్క పని ఆటకట్టు అయిపోయినప్పుడు, వాడికంటె నీచమూ, హాస్యాస్పదమూ అయినవిషయం మరొకటి ఉండదు—అని ప్రపంచం భావిస్తారనేసంగతి నీకూ తెలిసొస్తుంది. అందుకని ఒప్పుగో, వచ్చిందేకట్నం.

మం—నాకు ఖర్లేదు. ఇది నేను భరించలేను. జలేశం గారూ! మీరూ దీనికంతకీ కారణభూతులు! మీరు గదిలో తాళంవేసిఉంచి నావిడయొక్క అందం, మీరు అదే వర్ణన, అదేవర్ణన తెగయమవర్ణన! కాని నేను మొన్న ణ్ణించీకుడా, అక్కడున్న వ్యక్తి మాఅమ్మంత ముసిలిదనీ, పెద్ద దెయ్యమంత కురూపిఅనీ, మీతో ఎన్నిసార్లు మొత్తు కున్నాను చెప్పండి!

అ—ఏమిటేమిటీ! ఓరి మహాగుజ్జు నేలబారు అనా మకుడా!

జ—బాగుంది, మరగాలమ్మా బాగుంది! అల్లా కవ్వించు, కానీ విసురూ!

అ—నీలాంటి పదార్థం ఒకడు బయలేరి అందం గురించి వాగెయ్యడమే! ఓరి నడకనేర్చినడబ్బా! ఏమి తీరండీ! ఆభళ్ళు చూస్తే జలదోగంవల్ల కలిగిన ఫలంలా ఉంది. ఆకళ్ళు! ఆహా! తడిపిండిముద్దమీాద చచ్చిన బొజ్జింకల జతలా ఉన్నాయి. ఆగడ్డం అన్నారా, సరేసరి, గజ్జేరు మొలిచినట్టుంది. మరి, శ్రీవారి, ఆదవడలు ఎండి నొక్కులుపడి కోతిశవందవడలకి నామూాషీ తెచ్చేటట్టు న్నాయి.

జ—దంచేశావు, మరగాలమ్మా! బలేరచన.

అ—అన్నీ అయింతరవాత మరోటి వినాలి. నాకు తమ్ముడోడున్నాడు. వాడిదగ్గిర మంచికత్తి ఉంది—బారెడు! నాకు గనక అన్యాయంజరిగిందా—..

మం—నీతమ్ముణ్ణీ నిన్నూ అంటించిరిలేస్తూ ! నిన్ను విరగడ చేసుగోడానికి నేను ఎక్కడికో లేచిపోతాను. చెప్ప కుండా !

అ—ఎక్కడికట లేచిపో! నిన్ను వెన్నంటుతాను.

జ—మరగాలమ్మా ! నీ బాహు లతలతో అతణ్ణి పెనవెయ్యక, ఇంకా చూస్తావేం ?

మం—(RF కి వెళ్ళిపోగా, వెనకాలే అమ్మతల్లి కూడా వెళ్ళిపోతుంది.)

జ—కిశోరీ ! ఈ యువకుణ్ణి - ఇతడు సజావుమనిషే- నువ్వు పెళ్ళి ఆడేశావా ?

కి—అయ్యా ! తమ ఆజ్ఞ శిరసావహించి, ఇప్పు డిప్పుడే ఈయనకి నామాట ఇచ్చాను.

జ—నా ఆజ్ఞా ?

న —అవునండి. ఇదిగో లిఖితమైన తమ అంగీకారం! మీ దస్తూరీ చూసుగోండి.

జ—ఓహోహో ! నువ్వూ తమాషాగా నటించి, ఎత్తువల్లే లాగేస్తున్నావే, నా పిల్లనీ ? ఈ ఎత్తుతోటే పిల్ల ఆస్తికూడా వేసుగోవాలనుకున్నావా ? అమ్మా ! నువ్వు ఆ మండోదరంకంటె తక్కువ మోసగాడవు కావే !

న—ఆగండి. జలేశంగారు ! మీ ఉత్తరంవల్ల నేను మీ అమ్మాయిని ఆర్జించుగున్నాను, నిజమే. కాని, ఈవిడ ఆస్తి మోసంవల్ల సంపాదించడం అంటే నాకు చాలా

అసహ్యాం. ఇదిగో చూడండి. (అని ఒక కాగితంతీసియిస్తాడు) ఇప్పుడు తమరు ఇవ్వవలసిన కట్నమల్లా తమ ఆశీర్వాదమే. నాకుగల యావదాస్తీ ఈ పిల్లపేర వేస్తున్నాను. ఒక మహారాజు కొడుక్కి ఈవిణ్ణి మిారిచ్చినా వాడు చేసేదీ ఇంతకంటె మరి ఉండదు.

జ—ఓరి దైవమా! నువ్వొక్కడో అసాధారణం మనిషిలా ఉన్నావే! ఔదార్యం నువ్వు తప్ప మరెవ్వరూ చూపించలేరని భావించి నువ్వు గర్విస్తున్నావేమో! చూడు, కిశోరీ! చెప్పు నీ గర్విష్ఠిమూర్ఖుడితో చెప్పు. ఏమనీ? బ్రహ్మాండంగా పిల్లతో వచ్చే ఆస్తి తనకి అవసరంలేదని వదులుకునేవాణ్ణి ఈ దేశంలోకల్లా నిన్నే చూశానని. ఇక, నా ఆత్మసాక్షిగా నే చెప్పేదేమిటంటే, ఈ దేశంలోకల్లా ఇతడు తప్ప మరొకడు ఆ ఆస్తికి అర్హుడు కాడని! ఇదిగో మిా కిద్దరికీ నా దీవెన్లు! పెడదార్ని పడ్డానంటే నాది మహా మొంటిపట్టు, సరియైన దార్లో ఉన్నానా, నాకు మహా నిదానం. (RF కేసి చూడడం నటించి) మరో అద్భుతంలా ఉందే! ఏమయ్యోయ్, పరిధానం! ఏదేనా మఠంలోంచి లేవదీసు గొచ్చావా ఏమిటి, ఈవిణ్ణి!

ప—ఈవిడ వేషంలోమాత్రమే సన్యాసిని! ఇంకా తణికీగా చూస్తే ఈ అమ్మాయి గాజూరావుగారి కూతురు,

విశాల! మేం ఒక్క వివాహం మీతో చెప్పకుండా తస్క రించినందుకు మీరు మన్నిస్తే, ఈవిడ నాభార్య.

జ—ఓరి దైవమా! మంచిఆస్తే! అమ్మ గడుసు భడవా! పరిధానం! నిన్ను క్షమించేశానోయ్! క్షమించాను. ఆ ముసుగు తీసేయ్. చక్కనిదేరా! మామగారికి మొక్కకుండా అల్లా చూస్తూ నుంచున్నావేమో!

వి—(జలేశానికి మొక్కి) ఇదిగోనండి, మనసారా మొక్కుతున్నాను. ముసలయ్యగారు! మా యెడల ఇక్కణ్ణించి సరిగ్గా వర్తించండి.

జ—అమ్మ, కోడలా! అల్లాగే, అల్లాగే! ఇంత ఆనందం మరి ఉండదు. అందర్నీ పిలిచేస్తాను. తలుపులన్నీ తెరిపించి వచ్చినవాళ్ళందర్నీ ఆదరిస్తాను. ఈకాలంలో చెప్పుకోతగ్గ పవిత్రదినాలు పిల్లల పెళ్ళిళ్ళరోజులే!

(LF నించీ, తంపటి వచ్చి నవ్వు మొహం పెట్టగా తెరపడుతుంది.)

---